# మనోమేఖల

(నవీన కథల సంపుటము)

పండిత వంగూరి సుబ్బారావు పంతులు

గారిచే రచియింపబడినది.



వసంత గ్రంథ[illegible]

చతుర్థ పుష్పము.

నరసాపురము.

కమలకుటీరము వారిచే

ప్రకటింపబడినది.

*1930*

# నివేదనము.

ఆంధ్రవిద్వల్లోకమునకు మణిమేఖల యను నీనూతన గ్రంథమును, మా వసంతగ్రంథమాలికలో చతుర్థపుష్పముగ నీ సంక్రాంతి పండగ దినమున ప్రకటించి సమర్పించుచున్నారము. ఇంతవరకును, మేము ప్రకటించిన గ్రంథములనన్నిటిని ఆంధ్రవిద్యాధికులు, పండితులు, పత్రికలు, కవులు, విమర్శకులు, ననేక విధముల కొనియాడి, గౌరవించిరి.

విద్యాశాఖాధికారులును, స్థానికప్రభుత్వములవారును, విశ్వవిద్యాలయములవారును, పరీక్షాధికారులును, ఉపాధ్యాయులును గూడ మమ్ము ప్రోత్సహించి, మాకు చేయూత నొసంగుచున్నందులకు మా కృతజ్ఞతానేక వందనములు.

ఈ గ్రంథము విద్యార్థులకు పఠనార్హములగు చక్కని 9 కథల (చిన్న నవలలు) తో విరాజిల్లుచున్నది. గ్రంథకర్తలగు శ్రీ॥ శే॥ పండిత వంగూరి సుబ్బారావు పంతులుగారు రచించిన యీమాదిరి రమారమి 30, 40 కథలలోవరి కొన్ని మాత్రమే యీగ్రంథమందు ప్రకటించితిమి. శ్రీ సుబ్బారావు పంతులుగారు ఆంధ్రలోకమునకు చిరపరిచితులు! ఆంధ్రవిద్వల్లోకమునకు చిరపరిచితమైన, సుబ్బారావు పంతులుగారి శైలి, రచనా సామర్థ్యము, కథావిధానము, పాత్రపోషణము మొదలగు విషయములుచర్చించి వర్ణించుటయనవుసరము. ఆంధ్ర మహాజనులు మా యీనూతన కుసుమమును స్వీకరించి పోషించెదరని నమ్ముచున్నారము.

నరసాపురము.
శుక్ల సం॥ర పుష్య శు ౧౪
మంగళవారము
సంక్రాంతి.

కమలకుటీరము.

లుగు డబ్బులు తెచ్చుకొనఁగల వానినిఁ దెచ్చుటకు నిశ్చయిం చుకొనెను. ఈసంగతులన్నియు భార్యతోఁ జెప్పిన నామె యం గీకరించునా? మిమ్ము చేసికొని నేనింత సౌభాగ్యమనుభవించు చున్నాను. పిల్లదానికైన కొంచెము మంచి సంబంధము కుదు ర్చవలెనని తగవులాడును. "ధవళేశ్వరము గుడిలో ముడిపెట్టి వేయుదము. ఏదియో యిష్టమైన సంబంధము కుదిర్చి కొంచె ము లక్షణముగనున్న పిల్లవానినిఁ జూడుమ"ని తండ్రి శేష గిరిరావు పేర నుత్తరము వ్రాసెను.

శేషగిరిరావు రాజమహేంద్రవరములో స్టేషనరీ మా స్టా. అతఁడు ట్రైయినింగువిద్యార్థుల కడకుఁ బోయి విచారిం చెను. "మా నాపగడ విశ్వనాథమను చిన్నవాఁడొకఁడు న్నాఁడు. అతనికి నాలుగు యెకరములభూమి యున్నది. లోవరు సెకండరీ ప్యాసైనాఁడు. ట్రైయినింగగుచున్నాఁడు. పదిహేను డు రూపాయలు సంపాదించు కొనఁగలఁడు." అని ప్రత్యు త్తర మొసఁగెను.

పార్వతి యెంతయందమైన దయిన నేమి? విధిబడి పంతులు పెండ్లము కావలెనని విధి యామె నుదుట వ్రాసియు న్నాఁడు. ఉచితకాలమునఁ బెండ్లి, యార్భాటములు లేకుండ జరిగినది. ఉంగరమును బరంపురము పట్టుబట్టలను మామగా

రల్లుని కిచ్చిరి. విశ్వనాథము రెండువందల రూప్యముల నగలు వధువున కొసంగెను.

## II.

"నవఖండవాడ గ్రామము"లో దాటియూరుల యింటికి విశ్వనాథము బసవిడిచి వచ్చుసరికిఁ బార్వతి కాలుసేతులుకడుగుకొనుటకు నీరిచ్చెను. ఇన్స్పెక్టరు వచ్చు దినము లగుటచే విశ్వనాథము నూతనముగ బదలీచేయఁబడిన క్రొత్తపాఠశాల యందలి పిల్లలతోఁ జిక్కులు పడుచుండెను. పార్వతి తల్లిని విడిచివచ్చి క్రొత్తకాపురములోఁ జిక్కులుపడుచుండెను. నల్లబల్లపై తెల్లసుద్దతో వ్రేళ్ళనొప్పులెత్తునట్లు దినమంతయుఁ బనిచేసిన విశ్వనాథము కష్టమనుకొనుట లేదుకాని బంగరు చేతులతో వంటకట్టెలు విరుచుచున్న భార్యను, గ్రొత్తకాపురమును జూచుసరి కాతనికి సహింపశక్యము కాక యుండెను. అది పల్లెటూరగుటచే వారికంతగాఁ గష్టములేదు. బడిపిల్లలు కొన్ని పనులు చేయుదురు. చిన్నతనముననే తల్లి చనిపోవుటచేఁ బదునాల్గేండ్ల వయసుననే చదువుమాని బడిపంతులై కొంతకాలమునుండి వంట కలవాటుపడిన విశ్వనాథ మామెకు సాయ మొనరించుచునే యుండును. ఆయూరఁగల వెలమదొరగారి పిల్లల కాతఁడు చదువుచెప్పును. వా రతని కింతకాయ కసరు మజ్జిగ మొదలైనవి పంపుచుందురు. పార్వతి మధ్యాహ్నము తీరికచేసి

కొని చక్కఁగఁ దలదువ్వుకొని దొరగారి యాడువాండ్రతోఁ గాలక్షేపమునకుఁ బోవుచుండును. వెలమ వారింటికడ నాడువాండ్రకుఁ జదువు చెప్పుటకు జానకీబాయిగారను నొక యామె కలదు. ఆమెతోఁ బార్వతి కమిత స్నేహమైనది. జానకీబాయిగా రెవ్వరో, ఆమె దేశమేదో, ఆమె సువాసినియో, కాదో ఏరికిని దెలియదు. ఆమె పదివత్సరములనుండి యాగ్రామమున వసియించుచున్నది. పార్వతిపై నామెకు మిక్కిలి యనురాగము వర్ధిల్లినది.

ఒకనాఁడు విశ్వనాథము భోజన మొనరించి బయటికి వచ్చుసరికి "టపాబంట్రోతు" లేఖ నొక దానినిచ్చెను. అది యొక శుభలేఖ. విప్పి చదివి నవ్వుచు లోనికిఁ బోయి "ఏమే! మీ మేనమామ కొడుకునకుఁ బెండ్లియఁట!" అని చెప్పెను. అప్పుడే యన్నమునకుఁ గూర్చుండిన పార్వతి వికాసనేత్రములతో నెప్పుడని యడిగెను. వారము దినములలోనని విశ్వనాథమనెను. పార్వతి ప్రత్యుత్తరము చెప్పలేదు. తలవంచి భోజనము చేయుచుండెను. విశ్వనాథ మదివఱకే చుట్టియుంచిన తమలపాకులచిలుకల నములుచు వెలమదొరగారి యింటికడనుండి తెచ్చిన కృష్ణాపత్రిక యందలి ప్రధానవ్యాసమును జదువుచు నిద్రించెను.

అతఁడు నిద్రనుండిలేచుసరికిఁ బార్వతి నూతికడ బట్టలు

మసలుచుండెను. ఈమె సున్నితమగు వ్రేళ్లు కందిపోవుచుండె నని విశ్వనాథుడు యోచించుచుండెను. ఇంతలో నామె పని ముగించి వచ్చి భర్తకు ఫలాహార మొసఁగి చేరువను నిలువఁబడి యుండెను.

"మనము రేపే బయలుదేర వలసియున్నది." అని విశ్వనాథ మనెను.

"ఇప్పుడు తొందర యేమి?"

"అయ్యో! నీ మేనమామ లుద్యోగస్థులు. కోష్టముల వసబుగా దింటికిఁ బోవుటకు మనము సంకోచించ నేల?"

"గట్టిముసలుకుఁ దోడకయుండిన సుఖము ననుభవింపఁగలను."

"నాకాయన యొక్కైన మంచి యుద్యోగ మిప్పింతునని చెప్పియుండెను. నీవు పోయి చెప్పిన —"

"నాకుఁ బెండ్లికి వెళ్లుట కిష్టములేదు —"

"ఏల?"

"ఏమియు లేదు —"

"అయ్యో! వెఱ్ఱిదానవు. వెళ్ళకుండిన బాగుండునా?"

"ఈ పాతుచీరలఁ గట్టుకొని పాతకాలపువారము కొరమాలిన పేరంటాలువలె అందఱు నాగరకులు-ముఖ్యలు-సింగారములతో నుండ- వారి నడుమకుఁ బోయి నేనుండవా? బీదబడి బాపనయ్య పెండ్లాము మా పార్వతియని మా మేనమామల భార్య లీసడింప నే వినలేను. —"

"ఏమి? మొన్నకొనిన బనారసుచీర కట్టుకొనకూడదు?"

"చాలు లెండు!" అని యామె స్త్రీలకు మాత్రమే సాధ్యమగు విధమున నీసడించి మొగము త్రిప్పుకొని చలి మెటికలు విఱచెను.

"ఏమే? ఆచీర బాగుగా లేదా?"

"చీరయున్న-చీరకుఁ దగిన రవికలో-చీరపైకి యీ ముష్టివెండి సొమ్ములా?"

విశ్వనాథుని ఫలాహారము నడుమ యాఁగిపోయినది. అతఁడు భార్యవంక వెఱ్ఱివానివలెఁ జూచెను.

"మంచిది. ముప్పది రూపాయిలున్నవి. దుద్దులజత కొందును." అని యాతఁడనెను.

"అక్కడికి నగలు పూర్తియగును కాఁబోలును. పోనిండిప్పుడు వెళ్లకుండిన నష్టమేమి?"

"వెళ్లక తప్పదు. అట్లయిన మఱచితిని. నీమిత్రురాలగు జానకీబాయిగారి నేమైన నెరు విమ్మనుము."

"అవును నేఁ నడిగెదను" అని యామె యుత్సాహముతో ననెను.

## III.

పార్వతి జానకీబాయి కడకుఁ బోవుసరి కామె సంస్కృతమునుండి ఆప్టేనిఘంటు సహాయమున నాంధ్రభాషలోని

కొక చిత్ర కావ్యమును భాషాంతరీకరించుచుండెను. పడకకుర్చీ పైనున్న జానకి పార్వతినిఁ బలికించెను. పార్వతి దాను వ్రాసినంతవఱకుఁ జదువుటకుఁ బ్రారంభించెను. అందొక శూరుఁడు మారు పేరుతో యుద్ధమునకుఁబోయి యపజయ మొందుటకు సిద్ధముగ నున్నప్పుడు పరపక్షము నందలి నాయకుఁడు గూల నాతని భార్యను జెఱఁగొనఁదలఁచుచుండువఱకువ్రాయఁబడియుండెను. ఆకథవిని పార్వతి యొక్క నిట్టూర్పును విడిచెను. చల్లగాఁ బొడ్డిమాటఁ జెప్పెను. జానకి నవ్వు మొగముతోఁ బార్వతిని హెచ్చరించుచుండెను. "ఇప్పుడు వచ్చిన పని యేమనఁగా?" అని పార్వతి సాగఁదీసి "మీా రేవమున వస్తు వెరవిస్తురేమో యని అనుగుచున్నారు" అని తలవంచెను.

జానకి నవ్వుచు "మీా యింటివారాయనా?" అని కర్తను గురించి ప్రశ్నించెను.

పార్వతి నవ్వే దానికిఁ బ్రత్యుత్తరము.

"ఆపీరువా తెఱచి యందలి దంతపుఁబెట్టెను తెమ్ము" అని జానకి పలికెను.

పార్వతి తెచ్చెను. జానకి పెట్టెతెఱచి "నీ యిష్టము మున వానిని దీసికొనుము" అనెను.

పార్వతి కాశ్చర్యమొదవెను. అందెన్నియో నగలున్నవి. అయిదారువస్తువులఁదీసి ధరించుకొనెను. నిలువుటద్దము కడ

కేగి తన మూర్తినిఁ జూచుకొనెను. అంతకుఁ బదిరెట్లలంకార ములకయిన సలంకారము కావలసిన తన సహజాలంకారము నామె చూచుకొని సంతసింపలేదు. ఆ సహజాలంకారమును మాటుపఱచుచున్న ఈకృతకాలంకారములకు ఱాళ్లు రప్పలు పొదవిన కపటాభరణములకు ముఱిసెను.

అవియన్నియుఁ దీసివైచెను. దంతపుఁ బెట్టెలో నుంచు చు "ఒడ్డాణము లేదా?" అని పార్వతి ప్రశ్నించెను. పఱపఱ కలముతోఁ బరుకుచున్న జానకి సులోచనముల యద్దముపైనుండి గుంటలుపట్టిన నేత్రోర్ధ్వభాగమునకు నల్లగుర్తు తిప్పి నవ్వుచు "నవి పనికిరావా?" యని యడిగెను. ప్రత్యుత్తరము వినకుండ "నదిగో! ఆకాగితపుఁ బెట్టెను దెఱువుము, అని బీరువాలోనున్న పాఁచని యొక్కపెట్టెను జూపెను. పార్వతి యది తీసికొనెను. అందేమియున్నది? మణిమేఖల! స్వర్ణవర్ణములఁ గాంతుల నీనునట్టి యారత్నాభరణమును పార్వతి ధరించెను. మయూరవాహనముపై నెక్కిన వాణి నాపల్లవాధర తిరస్కరించుచుండెను. ఆయందమును జూచి విరాగిణియగు జానకి లేఖిని పని మానుకొనెను. "బాగుగనున్నది" అని జానకి పలికెను.

"నాకింక నే నగలును వలదు. ఈమణిమేఖల నెరువిమ్ము!" అని పార్వతి పలికెను.

"నీకిష్టము వచ్చినవి తీసికొనుము" అని జానకిఁ బలికెను,

గాలిపటమును గ్రొత్తగాఁ గొనిన బాలునివలె దన్నుఁ దామఱచి మణిమేఖలతోఁ బార్వతి తుబ్బుమని పనువెత్తెను. దంపతు లుచితసమయమునఁ బెండ్లికి బోవుటకు బండి నెక్కిరి.

## IV.

రాత్రి జామగునప్పటికిఁ బెండ్లినుండి తిరిగివచ్చి కాకినాడ సత్రములో విశ్వనాథము భార్యతో బసచేసెను. అమావాస్య రాత్రి యగుటచేతను, రాత్రియే పిఠాపురము బాటను బోవుటకు దొంగలభయ మగుటను వారా రాత్రి యచ్చటనే బసచేసిరి. పెండ్లిలో జరిగిన విశేషములును, భాగ్యవంతుల వెఱ్ఱి వేషములను భార్యాభర్తలువిమర్శించుకొనుచువినోదముగ మాటలాడుకొనిరి. తెల్లవారినపిమ్మట లేచి బయలుదేరుటయే మంచిదని విశ్వనాథ మనెను. ప్రభాతముననే పార్వతి లేచి "ఏమండోయి! మన ట్రంకుపెట్టె యేది?" యని యాతురతతో నింకను బ్రయాణపు బడలికచే నిద్రించుచున్న భర్తనడిగెను. అతఁ డదరిపడి లేచెను. పెట్టెలేదు. పెట్టెతోఁబాటు మణిమేఖలయు సందేయుంట నదియు లేదు. సత్రమనియు, రాత్రిభాగమనియు విశ్వనాథము రత్నముల యొడ్డాణమును రాత్రి యందుంచుమని భార్యతోఁ జెప్పెను. పెట్టె తలకడఁ బెట్టుకొని వారు నిద్రించిరి. తెల్లవారు సరికిఁ బెట్టెలేదు వంటల కొలంది జనము దిగిన యాసత్రమునం దేరి నడుగుదురు? కేకలు వైచిరి. సత్రి

ము గుమాస్తాతోఁ జెప్పిరి. రక్షకభటుల రప్పించిరి. ఎంత ప్రయత్నము చేసిన నేమియు లాభము లేక పోయినది. పార్వతి హతాశయై, దుఃఖభావముచే నేమియుఁ దోఁపక బెంగపెట్టుకొని యుండెను. విశ్వనాథము మాత్ర మేమిచేయును?

## V.

మరి పది దినములకుఁగాని రా వీలులేదనియు వచ్చునప్పుడా యొడ్డాణమును దీసికొని వత్తుమనియు నాలస్యము మన్నింపుమనియు నొకలేఖ భార్యచే వ్రాయించి విశ్వనాథము జానకిపేరఁ బంపెను. కాకినాడనుండి నవఖండవాడకుఁ బోవుటకు బదులాతఁడు జన్మస్థానమగు రామచంద్రపురమునకుఁ బోవుదమని చెప్పెను. మణిమేఖల యుంచిన పెట్టెపై టాకరు కంపెనివారి పేరును విశ్వనాథము చూచియుండెను. ఆతఁడు తిన్నగా రామచంద్రపురమునకుఁ బోయి తమకున్న నాలుగు యెకరముల పూర్వార్జితమగు భూమి నమ్మివేసెను. పెద్దలు సంపాదించిన తప్పెల ముంతయుఁ బినతండ్రిగారి వెలిసెపైనుండి దింపి యమ్మివేసెను. రమారమి యైదువేల రూప్యములు వచ్చినవి. దానితో మదరాసునకు భార్యను వెంటఁ బెట్టుకొని పోయెను. సరిగ మణిమేఖలవంటి నగను గుర్తించి యది పదునేనువేల రూప్యములకు వాయిదాలమీఁదఁ జెల్లించుటకుఁగాని దానిపై జానకిపేరు పోయినయొడ్డాణముపై నున్నట్లే చెక్కిం

చెను. టాకరు కంపెనీవారి పెట్టెలోనే పెట్టించెను. నవఖండ వాడకుఁ బోయి జానకి కిచ్చి రమ్మని భార్యనంపెను. నూరు రూపాయిలు మాత్రము వారు మిగుల్చుకొనిరి. జానకి కడకుఁ బార్వతి మణిమేఖలఁ దీసికొని పోయెను. జానకి యాంగ్లేయ మింకను వ్రాయుచునే యుండెను. అప్పటికి శత్రురాజు భార్యను జెఱఁగొని దీసికొనిపోయిన శూరుఁడు దురాత్మగ్రములన్నియుఁ దీరు నష్టాతనికిఁ జెఱ సంప్రాప్తమయిన భాగమును, స్త్రీ సాహసమును వర్ణితమగుచుండెను. వీరుఁడు మారుపేరు పెట్టుకొనినందు కు స్థలభాండవిసర్జనమయిన స్థితినంతయుఁ జదువవలెనని జానకికిఁ గుతూహలమయినది. కాని పార్వతికిఁ దొందరపను లుండుననియు వంట సేసికొనవలయుననియుఁ దలఁచి ప్రక్కను నిలువఁబడియున్న యామెను బీరువాలో నుంచుమమ్మా పెట్టె? సుఖముగ నుంటిరా? పెండ్లివారు కావలయున,” అని మాత్ర మడిగెను. పార్వతి పెట్టెను బీరువాలోనుంచి తాళమువైచి, గుత్తితీసి జానకి బల్లపైఁబెట్టి వెడలిపోయెను.

## VI.

పేదతనములోఁ బేదతనము. ఉద్యోగమునకు రాజీనామా యొసఁగి నాఁటి రాత్రియే విశ్వనాథము కాకినాడకుఁ బోయెను. పదివేలరూప్యంబు లప్పుతీర్పవలెను. తాను ప్లీడరు గుమాస్తాపనిలోఁ బ్రవేశించెను. చిన్నయిల్లద్దెకుఁ దీసికొనిరి.

పార్వతికొక సింగపు కుట్టుయంత్రమును గొనియిచ్చెను. వారిరు వురు రాత్రింబవళ్లు కష్టపడఁజొచ్చిరి. కుట్టుపనివలనఁ బార్వతి దినమున కొకరూపాయివఱకు సంపాదించుచుండెను. రాత్రి నకల్లువ్రాసికూడ విశ్వనాథమును, దినమునకు మూడురూపా యలు సేకరించుచుండెను. పట్టణమున నించుక వ్యయ మధికమైనందునఁ బార్వతి దాసినైనఁ గుదుర్పలేదు. అణా డబ్బుల వెనుకవైచుటయే వారి యాదర్శము. పార్వతి బంగరుచేతు లట్లు తోముచుండెను. గుడ్డలు కత్తిరించుచుం డెను. అయిన నేమి? కష్టపడవలెను. సంవత్సరము పూర్తి యగుసరికిఁ బదివేలలో నొక వేయి రూపాయలు దీర్చిరి. ఋ ణము తీర్చుటయందు విశ్వనాథముకంటెఁ బార్వతి యెక్కుడు కష్టపడుచుండెను. కుసుమకోమలగాత్రి, పార్వతి కష్టములఁ జూచి విశ్వనాథము కన్నుల నీరుపెట్టకొనుచుండెను. అయిన నిప్పుడా విషయము యోజించుటకైన వారికిఁ దీరికలేదు.

మరి తొమ్మిదిసంవత్సరములు గడచినవి. నవఖండ వాడనుండి వీరెచ్చటకుఁ బోయిరో యేరికిఁ దెలియదు. కష్ట ములు కాపురములు చేయవు. అన్యోన్యానురాగముగల దం పతు లిరువురు తపశ్శక్తిచే నజ్ఞానవిముక్తుఁడగు యోగివలె ఋ ణవిముక్తులైరి. కాని వారిరువురు నిప్పటికి వృద్ధులవలెనుండిరి. వారి శరీరములు జీర్ణము నొందినవి. కాలము గడచి వయసు

హెచ్చినది. ఆ గృహావసతారుణ్య మిరువుర మేనుల నుండియు జారినది. కాని నాఁడే వారిరువురును ఋణశేషమును బూర్తిగఁ జెల్లించి నిట్టూర్పులు విడిచిరి. వారి భౌతికశరీరము లింక నేపనియుఁ జేయలేనంత నీరసము నొందినవి. ఋణవిముక్తుల మైతిమను సంతోషమే వారి కిప్పుడు ప్రాణము.

ఆకస్మికముగ నొకనాఁడు పార్వతి జానకీబాయిని కాకినాడ మహిళా సమాజమునఁ గలిసికొనినది. పార్వతి జానకీబాయికి నమస్కరించెను. మీరెవ్వరని జానకీబాయి యడిగెను. పార్వతినని చెప్పెను. జానకీబాయి పార్వతి బక్కతనమున కాశ్చర్యపడి, కౌఁగలించుకొని, యామె యుదంతము నడిగెను. ఆమె తన కష్టములన్నియుఁ జెప్పి యాకష్టములకు జానకీబాయి యే కారణమని పార్వతి నుడివె.

"ఎట్లు"ని జానకి యాతురతతోఁ బ్రశ్నించెను. పార్వతి మణిమేఖల వృత్తాంతమునుఁ బూసగ్రుచ్చినట్లు చెప్పెను.

"అయ్యో! ఎంతకాలము వ్యయపెట్టి కష్టపడిరి. ఎట్టి కష్టముల పాలైరి. నిద్రాహారములు లేకుండ నెన్నిసిలుగులకుఁ జిక్కిరి. వెఱ్ఱిపిల్లా! వృథాగా నీజీవితమంతయుఁ బాడుచేసికొంటివి." అని జానకి యనెను.

"ఏమి?" అని పార్వతి ప్రశ్నించెను.

"అది నేఁటివఱకు నీవు పెట్టిన బీరువాలోనే యున్నది.

మణిమేఖల బంగారపుదికాను. గిల్టునగ. నీవు తెచ్చినది నేనిప్పటికిఁజూడనైనఁ జూచియుండలేదు." అని జానకి చెప్పివేసి కన్నులనీరు పెట్టుకొని పార్వతినిఁ గౌఁగలించుకొని యాదరించెను.



# ౨

# ప్రభావతి.

## (విచిత్రపునర్వివాహము.)

— ♦ —

ఆనందరావు జపానుదేశమునుండి గనుల పరిశ్రమము నేర్చుకొని స్వగ్రామమగు పద్మనాభపురమునకు వచ్చెను. తలిదండ్రులింటికిఁ బదియేండ్లకు వచ్చిన పుత్రునిఁ గాంచి సంతసించిరి. విదేశములకుఁ బోయి వచ్చినవారితోఁ బఙ్క్తి-భోజనములఁ జేయుట పల్లెటూళ్ళయందు మిక్కిలి కష్టమే! ఏమైన నేకపుత్రవిషయము. జానకిరామయ్యగారు పుత్రుని నిరాటంకముగ నింటికి రానిచ్చిరి. "వలసినయెడలఁ బ్రాయశ్చిత్తము చేసికొనియో, శంకరస్వాములవారివలన శుద్ధపత్రిక నందియో బహిష్కారము మాన్పుకొనలేమా?" యని జాన

కిరామయ్యగారి ధైర్యము. పుత్రుని రాక మొదలు సన్నిహిత బంధువులు, మిత్రులుమాట నటుండ, వీరింటికిఁ జాకలి, మంగలివాండ్రుకూడ వచ్చుట మానుకొనిరి. వారి గృహముపైన వ్రాలిన వాయసమునకుఁగూడ బహిష్కారభయమే హెచ్చుగాఁ జొచ్చెను. వారి కుటుంబమును, గృహమును, నొక యంత్యజాతివారిదివలె గ్రామమునఁ గలవారందఱు నెంచిరి. తుదకుఁ "బ్రాయశ్చిత్తమైనచోఁ బఙ్క్తిభోజనమునకు వత్తు" మని కొందఱు చెప్పిరి. జానకిరామయ్యగారు కుమారునితోఁ జెప్పిరి. కుమారుఁ డంగీకరింపలేదు. ఆసాయంకాలమునకుఁ గోలారుకనకపుగనులత్రవ్వు సంఘమునుండి యానందరావునకు నెలకాఱువందల రూప్యముల వేతనము నిత్తుమని యొక యుత్తరము వచ్చెను. ఆనందరావు పదిపదునేను దినములలోఁ బోవలయునని తండ్రితోఁ జెప్పెను. "నాయనా! కోడలెదిగి పుట్టినింటఁ గూర్చుండియున్నది. కార్యము చేసికొనిపోవుట మంచిది. పెండ్లియైన రెండు సంవత్సరములకే నీవు మూర్తిరాజు మాటవిని మాతోనైనఁ జెప్పక విదేశమైన జపానుపోయి యింత దెచ్చితివి. వేలు సంపాదించినమాత్ర మేమిలాభము? కులగౌరవముల నాశనము చేసితివి. నీయత్తవారి కుత్తరము వ్రాసియుంటిని. నేడో రేపో ప్రత్యుత్తరము రాఁగలదు. ఆతరువాయి తీర్చుకొనినచో భార్యనుగూడఁ దీసికొని పోవచ్చు"

నని జానకిరామయ్యగా రనిరి. కుమారుఁడు విని విసన్నాకార ముండెను. ఇంతలో నానందరా వత్తువారి యూరినుండి కూలి వాఁడొక యుత్తరమును దీసికొనివచ్చి జానకిరామయ్యగారి చేతి కిచ్చెను. ఆయుత్తరమును జదువుమని తండ్రి చత్వార మగుట చేఁ గుమారుని చేతికిచ్చెను. ఆనందరా విట్లు చదువ సాగెను. "మహారాజశ్రీ పంచలపర్తి జానకిరామయ్యబావగా రికి, ఆవునేతి శివరావు వ్రాయించుకొన్న విజ్ఞాపన. వి॥ తమ భావమరది నిత్యం త్రికాలములయందు నమస్కారములు చేసి చేయంగల విన్నపములు. ఇచ్చట రంగాపురములో నంతా క్షేమము. అచ్చటి క్షేమసమాచారములను వ్రాయించి పంపి స్తూ రాఁగలందులకుఁ గోరుచున్నాను.

త॥ తమరు వ్రాయించిన వుత్తరము అందినది. మా రెండవ అన్నగారికి ప్రాణముమీదకువచ్చి నిన్నరాత్రి క్రింద పడవేసినాము. దైవానుగ్రహంవల్ల కొంచెము నిమ్మాదిగను న్నది. ఇదివఱకు మాట్లాడినదానినిబట్టి చూడగా శ్రీమా అ న్నగారి కొమార్తె కార్య మింతటిలో చేయువలెనని లేదు. నేనున్నూ అనేక విధముల చెప్పియుంటిని. ప్రాయశ్చిత్తం అయితే బాగుంటుందని ఆయన యభిప్రాయము. ఆయన కుమార్తె విషయంలో నేనాయనకంటె యెక్కువ క్షేమలాభా లు కోరేవాడను కానుగదా? మన ఆనందరావు నందుల కం

గీకరింపఁ జేయవలయును. లేనియెడల ప్రస్తుతం యీగోల అ ణిగేవరకైనా పంపుదురని తోచదు. వాళ్ళకు భర్తలేకపోవడం కంటె కులంపోవడం యెక్కువతప్పని తలుస్తూయున్నారు. మీదగ్గర రహస్యమెందుకు? వాళ్ళిదివరకు చెప్పే మాటలను బట్టి చేసే పనులనుబట్టి చూస్తే బలవంతంగాగాని పిల్లను పంపే టట్లు తోచదు. మనవాడికోలారుపనినిమిత్తము చేసిన దరఖా స్తుపైని ఆర్డరు వచ్చింది లేనిది తెలియపర్చగోరినాను.

రంగాపురము, 12—4—1911. } చిత్తగించవలెను, ఆవునేతి శివరావు.

ఈయుత్తరమును జదివి యీసంపరావు మండిపడి, తం డ్రిపై నాలుగు కేకలువైచి, తత్క్షణ మొకబంట్రోతువానినిఁ బిలిచి పెండ్లాము లేకపోయినప్పుడు చూదామువెండి. వెధవ "అర్లీ మారేజి" చేసినంత మాత్రాన్ని నేను బద్ధుడనై యుండవలె నని యెక్కడవుంది" అని పరుషవచనములతోనున్న తండ్రితోఁ జెప్పి కోలారుపనిలోఁ బ్రవేశించుటకు వెడలిపోయెను. తండ్రి పుత్రుల కుద్యోగమైన సంతోషమైన లేక యే దినములు గడు పుచుండెను.

## II.

శివరావు సంస్కారప్రియుఁడే! కాని పెద్దవాండ్రకు భయపడు స్వభావముకలవాఁడు. ఈతనికిఁ బ్రభావతియనిన

బహుప్రేమము. చిన్నతనమునుండియు నామెకు విద్య మొన
లగునవి చెప్పి, తనకు సంతానములేనందున నామెనే ప్రేమిం
చుచుండెను. ప్రభావతి యుక్తవయస్కురాలై యుండగ భర్త
యగు నానందరావును జేరఁజాలక పోయినందులకే విచారించు
చుండ నామె జనకుఁడుకూడ మరణమునొందెను. ఆమె యొ
క్కతెయే కర్పూరముగారికి సంతానమగుటచే నాయన సమ
స్తమయిన చరస్థిరరూపకమయిన సొత్తు నిప్పుడు శివరావు
చూడవలసివచ్చెను. ప్రభావతి కొకనాఁడు మనుచరిత్రము
పాఠము జెప్పుచుఁ బడక గదిలో శివరావు శయనించియుండగ
నాతని వదినెగారును భార్యయుఁ జావడిలో నొక్కమారు గొ
ల్లుమనిరి. ఎవరో యామెను భర్తపోయినపిమ్మట చూడనివా
రు వచ్చియుందురని శివరావు పాఠమునుజెప్పుచునే యుండెను.
"ఇంకా మాయమ్మకు పాఠము లెందుకోయి నాయనా?"
యని వదినెగారు శివరావు గదిలోనికి గుండెలు బాదుకొనుచు
బ్రవేశించి తనూజాతను గౌఁగిలించుకొని యేడువసాగెను. ప్ర
భావతి నిర్ఘాంతపోయి సంగతియేమని యడిగెను. నాయనా!
ఇంకేముంది—నాయనా! యింకేముంది" యని యామె రోజు
చుండెను. తుదకు శివరావుభార్యవచ్చి యానందరావు పో
యినాఁడని చెప్పెను. తెల్లఁబోయి శివరావు లేచి "యెవరు
చెప్పి రెవరు చెప్పిర"ని మంచము దిగి చావడిలోనికి వచ్చెను.

పాపము! జానకిరామయ్యగారే! గనులలోఁ బనిచేయుచుండగ నదికూలి యానందరావు మృతినొందెనని మిత్రులు తంతినిచ్చిరనియుఁ బత్రికలోఁ బడినదనియు, శివరావు స్పష్టముగ విని దుఃఖించెను. "పోయినకొడుకు పోయినాడు నాయనా! కావలసిన వాళ్ళము. కాలముతీరి పెద్దవాండ్రమైతిమి. ఇంటిదాని దుఃఖము చెప్పుటకు వీలులేక యున్నది. కోడలి నిప్పుడైన నొక్కసారి పంపిన దానికి దుఃఖోపశమనమగును." అని దుఃఖమును మ్రింగుకొనుచు జానకిరామయ్యగారు చతికిలఁబడెను. "అసత్యవార్తలుకూడఁ బుట్టుచుండును. అది నిజమేనా?" అని శివరావు జానకిరామయ్యగారిని వెఱ్ఱిచూపులతోఁ నడుగుచుండెను. "నిజమే! నాయనా! "టెలిగ్రాము" వచ్చినదని" జానకిరామయ్యగారు నచ్చఁజెప్పిరి. ఇఁక నేమున్నది! అందఱు గోల! అపరిమిత దుఃఖములో నుండిరి. ఆఱు మాసములైనను గాకుండగనే యల్లుఁడు మామలు వెడలిపోయిరని యందఱు నేడ్వసాగిరి. "ఇప్పుడు కోడలిని దిన్నఁగఁజూడ వలసినదని, నాయనా! ఏమి చెప్పుకొనను. కొడుకు తల్లిని భూతమై పీకుకొని తినుచున్నాఁడు. ఆయూపేక్ష యేమో? ఏమి తెలియును? కోడలిని బంపవలెను." అని జానకిరామయ్యగారు కోరిరి. "ఇప్పుడు తల్లిచాటున నుండవలసిన స్థితి. దుఃఖసముద్రములో మునఁగియున్న సూరమ్మగారు తన కుమార్తెయగు ప్రభావతినిఁ

బంప వీలులేదనుచున్నద”ని చెప్పిరి. జానకిరామయ్యగారు చేయునదిలేక విచారముతో బద్మనాభపురమునకు వెడలి పోయిరి.

II.

శివరావు తన యన్నకూతురు దుఃఖమును జూడజాల క పోయెను. తనకు మైసూరలో నుద్యోగమైనందున బ్రిభావతిని భార్యను దీసికొని వెడలిపోయెను. అచ్చటకి బోయిన వెంటనే యొకనాడు ప్రిభావతిని దీసికొని పూనావితంతుశరణాలయమునకు వెడలిపోయి యందామె నుంచి పునర్వివాహమునకు బ్రికటన మిట్లొనరించెను.

“వరుడు కావలెను.

అందమయిన 15 సం॥ రముల ప్రాయముగల ఆంధ్రి స్మార్త బ్రాహ్మణవితంతు బాలికను పెండ్లియాడుటకు వరుడు కావలయును. స్వతంత్రి జీవనముగల ఆంధ్రిస్మార్త బ్రాహ్మణ చిన్నవా డెవరయిన దరఖాస్తు చేసికొనవచ్చును.”

చాల దరఖాస్తులు వచ్చినవి. ప్రిభావతి కన్నియు శివరావు చూపుచుండెను. అన్నిటిలో నొక యుత్తరమును వారిరువురు కలిసి వేఱుపఱచిరి. ముత్యములువంటి వ్రాతగల యాలేఖ మిం దిట్లున్నది.

"సంవత్సరమునకు 10,000 రూపాయలు రాఁబడి కలదు. వేయి రూపాయిలు వచ్చు భూములు కలవు. వరుని వయస్సిరువదినాల్గు. గోత్రము కౌండిన్యస; ఆంధ్రస్మార్త బ్రాహ్మణుఁడు. ఇష్టమైనచో, P. Andrew c/o Andhra Lodge, Bombay." అని వ్రాయవలెను. దీనినే శివరావు వేఱుపఱచి నిశ్చయించెననని ప్రభావతితోఁ జెప్పెను. తుద కొకనాఁడు శివరావు మైసూరులో నుండగనే ప్రభావతికిఁ బూనాపట్టణములో వివాహము జరిగినది. శివరావించుక భయస్తుఁడు. వివాహమున కతఁడు పోలేదు. ప్రభావతి నూతన భర్తయింటికిఁ బోయి సుఖముగఁ గాలము గడుపుచుండెను. ప్రభావతి వరుఁడిప్పుడు రటన్ తాతాగారి యినుపయంత్రశాల పనులయందు బొంబాయినగరమున నుండెను. వారిరువురకు నన్యోన్యము ప్రేమము హెచ్చి సుఖకాలక్షేపము చేయుచుండిరి.

సంవత్సరములో ప్రభావతికొక చక్కని పుత్రుఁడు కలిగెను. పుత్రోదయమును గురించి శివరావునకుఁ దెలియఁబఱుపవలెనని ప్రభావతికిఁ గుతూహలము కలిగినది. భర్తకుఁ దెలియకుండ నామెయే యొక తంతివార్త నంపించెను. ఇంవలి చిత్రము మాత్రము వినుఁడు. ప్రభావతియు నామె వరుఁడు నెప్పుడు నొకరినొకరు తమ పూర్వాశ్రమ విషయముల నడిగి

తెలిసికొనియుండలేదు. అది వారి ప్రేమమున కంతరాయము గ నుండునని వారు మఱచిరేమో మనకుఁ దెలియదు.

ఒకనాఁ డెనిమిది గంటలకు గణేష్వాడిలోనున్న ముప్ప దియాఱవసంఖ్య యింటికి శివరావుగారు రాత్రి యెనిమిది గం టల కొక విక్టోరియాగుఱ్ఱపుబండిపై వచ్చి నిలువఁ బడిరి. సేవ కుఁడు పోయి ప్రభావతితోఁ జెప్పెను. తన ముద్దుల పుత్రిని బినతండ్రికిచ్చి, ప్రభావతి నూతనవికాసముగల ముఖముతోఁ బినతండ్రి నెన్నియో ప్రశ్నము లొనరించి, క్షేమసమాచార ము లడుఁగుచుండెను. ఇంతలోఁ బ్రభావతి భర్త తన కార్య స్థానమునుండి గృహమును జేరి తలుపు తెఱచుకొని లోనికి వ చ్చెను. ప్రభావతిభర్త "యూరేషియన్" దుస్తులతో నుం డెను. ఆతని పేరు ఆండ్రూ (Andrew) కదా? శివరావును బ్రభావతి "యాంగ్ర్రూఁడు" పరిచయు బఱచెను. ఆండ్రూవై పునకు శివరావు ధారాళముగఁ జూడలేక పోయినను కొంచె ము సేపూరకుండి యేమైన మాటలాడుట మంచిదని "పిల్లవా నికిఁ బేరేమి పెట్టుదురు?" అని శివరావాండ్రూ నడిగెను. ఆండ్రూ నవ్వుచు "రామ్" అనెను.

శివ—దేవుని పేరా?

ఆండ్రూ—కాదు—మాతండ్రిగారి పేరు.

శివ—(కొంచెముసేపు మాటలాడలేదు.) ఆతని కు

టుంబచరిత్ర మడిగినచోఁ దన కుటుంబ చరిత్రము వెల్లడియ గుచుండి నట్లాతనికి గుండెలు దడదడలాడుచుండెను. కొంతవ డికి నిట్టూర్పును విడిచి "మీతండ్రిగారి పేరు?" అని యడి గెను.

శివ—జానకిరామయ్యగారు.

ఇంతలోఁ బాపము శివరావునకుఁ బ్రభావతి మామగా రగు పందలపర్తి జానకిరామయ్యగారు జ్ఞప్తికి వచ్చెను. ఆనంద రావు మరణము స్మృతికి వచ్చెను. ఏదియో యోచించుచుం డెను. ఆబల్లపై నొక కార్డు కలదు. అది చుట్టచుట్టుచు శివ రావు కాలూగించుచుండెను. ఆకార్డు పైవిలాసము నాతఁడు చూచెను. చదివెను. అది యాతని యిష్టమునకు వ్యతిరేక మే! ఆశ్చర్యము!!

శివరావదరిపడి లేచెను. ఆంద్రహాను బరిశీలనముగఁ జూచెను. "నాయనా! ఆనందరావూ! నీవు జీవించియున్నావా?" అని సంతోషముతోఁ గౌఁగిలించుకొనెను. ప్రభావతి తెల్లఁబోయెను. ఆగదియంతయు నిశ్శబ్దమైన తెల్లనికాంతి వచ్చి పోయినట్లయ్యెను. ఆనందరావు శివరావును గుర్తించి "ఈమె మీసోదరుని తనూజయగు ప్రభావతియేనా?" యని యాశ్చర్యముతో నడిగెను.

ఆనందరావు కోలారుగని కూలిన వెనుకటి దినముననే

బొంబాయిపట్టణమునకు వెడలిపోయెను. అది మిత్రులేటుఁ గక తంతినిచ్చిరి. ప్రాంతయుద్యోగుల జాపితా ననుసరించి యే పత్రికలో గనిలోఁ గనపడనివారి పేరులు పడినవి. ఆనందరావు తన మరణమును గురించి పత్రికలలోఁ జూచి "యిదియు బాగుగనే యున్నది." అనుకొని చిరకాలాపేక్షితమైన ప్రౌఢవివాహము నొనరించుకొని తలిదండ్రులకుఁ దెలియకుండ జీవించుచుండెను. ఇప్పుడు వారికిఁ దంతినంపిరి. ఆనందరావింతకాలమునుండియుఁ దలిదండ్రులకుఁ గలిగించిన దుఃఖమునకు క్షమాపణ వేడుకొనుచు వారికి వ్రాసిన యుత్తరమునే శివరావు చదివెను. ఆనందరావు మరణింపలేదు. దైవయోగము చూచితిరా? ప్రభావతి వితంతుకన్యక కాదు. వారి వారి మనస్సులయందు గల్గు విచిత్ర వికారములను జదువరులూహించుకొందురుగాక? ఆనందరావునకుఁ బ్రభావతిపై ననురాగ మేమగును? జానకిరామయ్యగారి సంతోష మెట్లుండును? తల్లిగారికిఁ బట్టిన పుత్రభూత మే[illegible]యుండునో?

# తి రు మ ల.

సగమురాత్రి గడచిపోయెను. ఆకసఁబడుచున్న దుర్గము చుట్టును నిద్రించుచున్న సైనిక నికాయములపై రజత

గుములసీను చంద్రికాంతి నలందుటకుఁ గావలయును, మలయ మారుతము మెల్లగఁ బ్రచార మొనరించుచుండెను. కావలి వారల యడుగుల చప్పుడులును గుఱ్ఱముల బుస్సు మను గుఱ్ఱులునచ్చటి ప్రశాంతమున కప్పుడప్పుడు భంగ మొనర్చుచుండెను. దూరమున బంధింపఁబడిన యేనుఁగులు తోఁకలతో విసరుకొనుచుఁ దుండములతోఁ జెత్తరొట్టను మెల్లగ నందుకొనుచు నింతలోఁ గునికిపాట్లువచ్చి యాహారము క్రిందకుఁ బడిపోవ మరల నందుకొని యూహ్యాయముగఁ గబళించుచు రాత్రి గడపుచుండెను. కోట బయట సైన్యమున కింతయుజాగరూకత—కాకున్న నిర్భీతిగ నిద్ర—కలిగి యుండినను, కోటలోపల నుత్కళేంద్రుఁడగు రామచంద్రవర్మ యేమియు దోఁపక ముట్టడి విడిపించుకొనుట కుపాయము లరయుచుండెను. నగరమునందలి జనులందఱు మేలుకొనియుండిరి. దుర్గరక్షకులు బురుజులపైనుండి దీపికాసహస్రములతో శత్రువులను బరికించుచుండిరి.

దుర్గమునకు వెలుపల నంతయు మైదానము. దూరమున నొకటిరెండు చిన్న పర్వతములుమాత్ర మగపడుచుండెను. ఆ ప్రాంతమునందలి వృక్షములపైఁ జంద్రకాంతి ప్రసరించియున్నను దుర్గముచుట్టునున్న పటకుటీరములకడ కాభాగము చీకటి గ్రమ్మిన దట్టమగు నడవివలెఁ గనఁబడుచుండెను.

ఆపర్వతమునకును కోటకును నడుమ సైన్యమునకించు క దూరమున నొక యుత్తమపటకుటీరము కలదు. దానికి బయట నొక పురుషుఁడు పరుండియుండెను. అతఁడు నిద్రించుట లేదు. ఆతఁడు దృఢకాయుఁ డగుటవలనఁ జూచుటకంత పొడగరిగా నగపడఁడు. ఆతని వయసునకుఁ దగిన సుందరాకారమును, ధైర్యస్ఫూర్తిచిహ్నములను, శాంతతేజమును దిలకించినవారి కాతనియందుఁ బూజ్యభావ మంకురించును. తుమ్మెదరెక్కలవంటి మీసములును, పరాక్రమదృక్సమన్వితములగు నేత్రములును, విశాలమైన ఫాలతలమునుగల యాతని వదనమును జూడఁగనే యాతఁ డొక యోధుఁడని చూచువారికిఁ దోఁచును. ఇప్పుడు యోజనతోఁ గూడిన బొమముడి యాతని ముఖముపై మేఘమువలె నావరించియుండెను. ఆతఁడు లేచి చల్లగాలికిఁ బ్రచారము చేయుచు మఱల శయ్యపై నొరగుచుండెను. ఆతనికిఁ గొంచెము దూరములో నొక భృత్యుఁ డాయుధపాణియై నిలువఁబడి యుండెను. ఇంతలో నొక పురుషుఁ డాసమీపమునకు వచ్చి "మహాప్రభూ! శరణు!" అని యాతనికి దూరమునుండియే ప్రణమిల్లెను.

"భయము లేదు. దగ్గఱకు రమ్ము!" అని పురుషుఁ డనెను.

"ప్రభువర్యా! కృష్ణదేవరాయలు నిద్రించుచున్నారా?"

అప్పు డచ్చట నిలువఁ బడియున్న భృత్యుఁడు ముందునకు వచ్చి "రాయలవారు వీరే. నీవు చెప్పఁగొనవచ్చును" అని, నిర్ణీతస్థలమును జేరెను.

ఆమాటలు విని యాయపరిచయవ్యక్తి రాయలను జూచి "ప్రభూత్తంసమా! నేను మీశత్రు వగునుత్కలేంద్రుని యుపసేనాధిపతిని. మీకుపకారము చేయుటకు వచ్చితిని. కడచిన రెండు వారములనుండియు స్వాధీనముగానికోట నిన్నటితో స్వాధీన మగుటకు సిద్ధమయినది కదా! రాజంనులకు, మంత్రులతోడను, సేనాధిపతులతోడను నిన్నటిరేయి రహస్యాలోచన మొనరించెను. (ఊపిరి బుచ్చుకొని) కొందఱు యుద్ధమనిరి. కొందఱు సంధి యనిరి. సంధి పొసఁగుట యెట్లని రాజునకు మీరు వర్తమాన మంపినటుల యుత్కలేంద్రుని తనూజాతను మీకర్పింపు మని నేను లేచి చెప్పితిని. మా రాజంనులకు మండిపడి "శత్రుపక్షములోని వానివలె మాటలాడుచుంటివా? పలుగాకీ!" యని గర్జించి యుద్యోగమునుండి తొలఁగించి నన్నుఁ బరాభవించెను" అని చెప్పి యూరకుండెను.

"నీ విప్పు డిచ్చటి కేల వచ్చితివి" అని రాయ లడిగెను.

"ఆకనఁబడుచున్న కొండయొద్దకుఁ గోటలోనుండి సొ

దంగము కలదు. రేపు రాత్రి కోటనుండి యుత్కళేంద్రుడు సైన్యముతో బయటికి వచ్చి మీపై నాకస్మికముగాఁ బడి మిమ్ము సమయింప నెంచియున్నాఁడు."

"నీవిప్పుడు మమ్మేమి చేయుమందువు?"

"మీకా సారంగము చూపెదను రండు."

రాయలు యోచించి "మంచిది! నీవు మా సైన్యము మరణము నొందకుండ విజయము కల్గునట్లు చేయుదునన వలదన నేల? కాని నీవు రాజద్రోహివి. రాజద్రోహ మెందును శిక్షార్హమే! అయినను మేము నీసహాయము నంగీకరించితిమి. కావున దీనికిఁ బ్రతిఫలముగ మేము నీప్రాణములను రక్షించెదము. కొంత ధనము నిత్తుము. ధనమువలన గౌరవము గలుగు ప్రదేశములకు నీవు పోయి జీవింపుము. మఱియొకటి! నీవీచెప్పు దానియందు మోసముండినచో నీకుఁ గఠినమరణమే శిక్ష. నీ శరీరము కాకులు, గ్రద్దలు భక్షించునుసుమా!" అనెను.

"ప్రభూత్తమా! పరీక్షింపుఁడు."

కృష్ణదేవరాయలు చిటిక వైచెను. భృత్యుఁడు సమీపించెను. ఎద్దియో సైగచేసి యుండును. పాతికగడియకాలములో రెండు వేలమంది క్షత్రియసైనికు లాయుధపాణులై వచ్చి నిలువఁబడిరి. కృష్ణరాయలును, దుస్తులు ధరించి వారి

నందఱిని, దీసికొని యుపసేనాధిపతితోఁ గలసి పర్వతమును జేరి యాతఁడు చూపిన సొరంగపుమార్గమున లోనికిఁ బ్రవేశించెను.

II.

తిరుమల యుత్కళేంద్రుని తనూజాత. పదిపదాఱు వత్సరములలేఁబ్రాయంపుఁ గుందరదన. అంకురించుచున్న యౌవన మాబాలిక సౌందర్యమునకు నూతనశోభ నొసంగుచుండెను. కాని యామె మూఁడు నాల్గుమాసములకుఁ బూర్వమొక సందర్భమున నొకచిత్రపటమును సందర్శించెను. ఆచిత్రఫలకము నామె కొని దాచి యుంచినది. చిత్రఫలకప్రథమసందర్శన సమయమున నామె కాకస్మికముగ హృదయము చలించెను. ఆవైకల్యము వెంటనే వదనమునఁ జిహ్నితమయ్యెను. ప్రప్రథమమున నా చిత్రఫలకమునందలి పురుషుని జూచుట సంతోషదాయకమయ్యె నాతఁడు తన భర్తయగుట దుర్లభమని తలఁచి యామె వేదననొందుచుఁ గ్రమముగఁ గృశించుచుండెను. ఆమె వ్యాకులత క్రమాభివృద్ధి నొందెను. కావుననే యామె యింత యర్ధరాత్రమున నొంటిగఁ గన్యకాంతఃపుర సౌధోపరిభాగమునఁ గాయు వెన్నెలను జూచుచు గవాక్షముకడఁ గూర్చుండి యుండెను. ఇదివఱ కామె కటాక్షవీక్షణములయందు మిలమిలలాడుచు నుండెడి చైతన్యమి

ప్పుడు చంచలత్వము లేక దృష్టి కేకాగ్రత బ్రసాదించెను.

ఆమె చూచిచూచి యొక్కనిట్టూర్పు పుచ్చెను. బాలిక నేత్రము లశ్రుపూరితము లయ్యెను. ఆమె చేతియందలి పూవుసురటి క్రింద జారిపడెను. తిరుమల, హస్తము చెక్కునఁ జేర్చి "ఆచిత్రపటమునందలి పురుషుఁడు దుర్లభుఁడు. ఆ పురుషుని నామధేయమైనఁ దెలిసినచో నాతనిఁ జేరి సుఖింతు ననునాశ యుండెడిది. పటము నెల వేయివరాలను తీసికొని చిత్రఫలకమును రచియించిన తనభర్త నారాజు పేరడిగి వచ్చి తెలిపెదనని పోయిన చిత్రకారుని భార్య నాలుగు మాసములు గడచినను వచ్చియుండిలేదు. మఱ్ఱియైదువందల వరాలుకూడ దిగవిడిచి పోయినది. మా కోట ముట్టడివలన నామె రాలేక పోయినదా? ఇంక నాకా చిత్రపటమునందలి పురుషుని పేరు తెలియునా? నానోము ఫలించునా? అంత యదృష్ట మీాదీనురాలికి లేదు." అని విషాదముతో శిరము నడ్డముగఁ ద్రిప్పు కొనుచుండెను. అందు నిరాశ సూచిత మగుచుండెను.

ఇంతలో నిరువురు పరిచారిక లామెయున్న గదిలోనికి బ్రవేశించి "అమ్మా తండ్రిగారి సెలవైనదనిరి" బాలిక కా మాటలు వినఁబడలేదు.

"అయ్యో! ఆసౌందర్యరాశిని జేపట్టని జన్మమేల" య ని యామె తలంచుచుండెను. "అట్లేల? నీజననీ జనకులయం

దు, నీ చెలికత్తెలయందు, నీ పెంపుడు పక్షులయందు, నీకిష్ట మేల లేకపోయినది? నీకు వారితో మైత్రి సౌఖ్యదాయక మేలకాకయున్నది? చిత్రఫలకమునందలి పురుషుని నేల మ అవలేక యుంటివి? వీరందఱికంటె నీకా పురుషుఁ డెట్లధికుఁ డు?" అని యొకవ్యక్తి మనసులోనుండి యామె నడిగినట్లు వినఁబడెను. అన్ని ప్రశ్నలకుఁ బాపమా ముగ్ధబాలిక యే మని ప్రత్యుత్తర మిచ్చును? తలిదండ్రులకంటె బాలికల కొ రులపై నధికప్రేమ మొదవుటకుఁ గారణము లెవ్వరు చెప్పఁ గలిగిరి? వారా సంగతి యితరు లెఱుఁగకుండ మాత్రము జాగ్రత్త తీసికొందురు. తనవారికంటె నా పురుషుని దిరుమల ప్రేమించుచున్నదెవ్వరో తెలిసికొనుటయే గాక యంతరా త్మరూపమున నామెను దానికిఁ గారణ మడిగిరని తలఁచి బా లిక—భయము—కాదు లజ్జ నొందెను.

మాటలఁ దండ్రియాజ్ఞను పరిచారికలు తెలియఁ బలి చిరి. తిరుమల లేచి యానైపునకుఁ దిరిగి ప్రక్కనున్న చి త్రపటము నెడమచేతితో గు ప్పపఱచెను. వారామెతో రా జాజ్ఞ నెఱుకపరచి యామె నలంకరించి త్వరలోఁ గార్యాలో చన మందిరముకడకుఁ జేరి లోనికిఁ బోవుటకు రాజాజ్ఞకై నిరీ క్షించుచు నభ్యంతర మందిరమున నిలువఁబడి యుండిరి.

అప్పటి కుత్కళేంద్రుఁడు సభలో లేచి యిట్లు చెప్ప

చుండెను. "నేఁటికి మనరాజ్య వినాశనము నిశ్చయమైనది. కాని కొనయూపిరి యున్నంతవఱకు నాబాలిక నాకులహీనుఁ డైన కృష్ణరాయనికీయ నంగీకరింపను. మన మందఱము మర ణమునకు సిద్ధము కావలెను. శత్రువులకుఁ జిక్కకుండ శు ద్ధాంత కాంతలను నఱికి వేయుదుము. కాని—యుత్కల రా జేంద్రుల వంశమింతటితో నంతరించు నని నాకు దుఃఖము పొ రలి వచ్చుచున్నది. అని చెప్పి వెనుకకుఁ దిరిగెను. రాజ సంజ్ఞ నెఱిఁగి, పరిచారికలు తిరుమలను రాజుకడకుఁ దెచ్చి ప్రక్కను నిలిపిరి—"నా కీబాలిక యొక్క తెయే సర్వమును. ఈమెను మాత్ర మంతఃపుర వనితలతో—చంపఁజాలను." ఆతనికి దుఃఖము మితిమీఱినందున ధైర్యము తెచ్చుకొనవలసి వచ్చెను. కొంతవడికిఁ గంఠము సరిచేసికొని యూపిరి బుచ్చు కొని "ఇప్పుడీ బాలిక స్వయంవరమున మీలో నొకరి నీపు ష్పదామము మెడను గీలించి, వరునిగా స్వీకరించును. ఆశూ రుఁ డీబాలికను సురక్షితముగ సొరంగపు మార్గమునఁ గోట బయటికిఁ దీసికొనిపోయి మావంశము నుద్ధరించును గాక;" అని బాలిక వైపునకుఁ దిరిగెను. ఆతని కనుగొలకులనుండి వేఁడికన్నీరు పొరలి వచ్చుచుండెను. అంతట నాతఁడు వంగి తనూజాతమూర్ధముపైఁ జేయివైచి మూపున దువ్వుచు "అ మ్మా! మాపైనున్న చిరకాల ప్రేమమును మఱచిపొమ్మం

ఎప్పటికైనఁ దలిదండ్రులను వీడి కన్య భర్తను జేరవలసినదే? కాని యిట్టి మహావిపత్తు చేకుఱునని, నిన్ను నేనిట్లోరుల పాలొనరింపవలయునని తలంచి యుండలేదు. పదాఱు వత్సరములు పెంచిన నిన్ను మేము విడిచి పెట్టుట దుర్భరమే! మే మీలోకమునే విడుచుచుంటిమి. నీవారి నందఱిని విడిచి నీభర్త నిఁక నేకాగ్రత నొందిన ప్రేమమునఁ జేరి నీవు సుఖింపుము. మా కదియే పదివేలు! పోయి భర్త నరసికొనుము." అని రాజు సింహాసనముపైఁ జదికిలఁ బడెను. ఆతని దృష్టి యిచ్చట లేదు.

"హా! హాతవిధీ! నాకై వీరందఱును మరణింప నేనేల బ్రదుకవలయును." అనుకొని తిరుమల తండ్రిని జేరి "ప్రియ జనకా! నే నవినయ మొనరించితి ననకుఁడు. మీయందఱికంటె నా ప్రాణము లధికమా? నేను నిందే యుందును. నాకై మీరు మరణింపనేల?" అని తలవంచుకొనెను.

"తల్లీ! నీవు జీవించినచో నీ పుత్రులవలన మా వంశోద్ధారణ మగును. నామాట నీవవశ్యము వినవలయు" నని యామె చుబుకము నొత్తి పంపెను. బాలిక తల వంకించి "నా మనోవల్లభుఁడగు చిత్రపటమునందలి పురుషు నెట్లు వీడను. నేనింకొకరి నెట్లు వరింపను?" అనుకొనుచు బాలిక దీర్ఘాలోచనమునఁ బడెను. ఇంతలో బాలిక వదనము తేజోవంత

మయ్యెను. తిరుమల తల పంకించి "అవునా ప్రతిన కెవ్వరీ సభయం దంగీకరింతురు? ఎవ్వరు వత్తురు? రారు. నే నేరిని వరింప నగత్య ముండదు. అట్లే యొనర్చెద" నని తలంచి పరిచారికను జేరి చెవిలో నద్దియో చెప్పెను.

అప్పుడా పరిచారిక సభ్యుల వైపునకుఁ దిరిగి యెలుఁగెత్తి "ఉత్కృష్టులారా! రాజపుత్రి నీమహావిపత్తునుండి తొలఁగింపఁగల ధైర్యవంతుఁ డీ సభయందుండిన నిచ్చటికి రావచ్చును. ఆ ధైర్యమూర్తి నీమె వరించును" అని ప్రకటించెను.

రాజపుత్రి లామాటలు విని యొకరినొకరు చూచుకొనిరి. ఆమహాసాహసము నెవ్వ రంగీకరింతురు? ఎవ్వరా కష్టకార్యము నొనరింపఁ గలరు? అని తలలు వంచుకొనిరి. అప్పుడొక పురుషుఁడు చటాలున ముందున కుఱికి తిరుమల కడకు వచ్చెను. పరిచారికలు తిరుమల మేలిముసుఁగును దొలఁగించిరి. "అయ్యో! నాయుద్దేశ్యమునకు వ్యతిరేకముగ నీతఁడెవఁడు? కానిమ్ము. ఈతఁ డాపత్తునుండి జనకుని రక్షించిన నాటిమాట కద!" అనుకొనుచు శిరఃకంపముచేఁ దన సమ్మతిని దెలియఁ బఱచెను. మరల మేలిముసుఁగు వైచి పరిచారిక లామెను దీసికొని పోయిరి.

అప్పుడొక సభ్యుఁడు పండ్లు పటపటఁ గొఱుకుచు లేచి "ఛీ! దాసీపుత్రికా! మోస మొనరించితివా?" యని యఱ

చుచు దుమికెను. సభ్యులును గత్తులు దూసిరి. "అటు చూడుఁడు! వేనవేలు సైనికులు మోహరించి యున్నారు. కోట మాస్వాధీన మైనది. వివాహము నంగీకరింపలేని కర్ణాటకరాజ్యలక్ష్మి సైనికులాకార్యము నొనరించి మిమ్ము చెఱగొనియెదరు." అని యా పురుషుఁడు పలికెను. అతఁడు కృష్ణదేవరాయలే! ఉత్కలేంద్రుఁడు కార్యము చెడివచ్చినదని లేచి సభ్యులను వారించి కొందఱు సభ్యుల నాలోచించుటకు బయటికి రమ్మని పిలిచెను. మారువేషము ధరించియున్న తిమ్మరుసు వారిని వెంబడించెను. కొంతవడికి రాజు తిరిగి వచ్చి తిరుమలను గృష్ణరాయల కిచ్చి పరిణయ మొనరించుట కంగీకరించి సంధిఁ జేసికొనెను.

## III.

"మీరీ కల్పిత విగ్రహము నిటనుంచి పొందియుండిన యవస్థను నిరీక్షింపుఁడు!" అని తిమ్మరుసు రాయల చెవిలోఁ జెప్పి శయ్యపైఁ గృష్ణరాయని విగ్రహమునుంచి వెడలిపోయెను.

పుణ్యస్త్రీలు తిరుమలను మేలిముసుఁగుతో శయనగృహమున విడిచి వెడలిపోయిరి. తిరుమల బుసకొట్టు త్రాఁచువలె నిట్టూర్పులఁ బుచ్చుచుండెను. గర్భశత్రువగు కృష్ణరాయని పరిక్క కామె కీ్రగంటి పరిసారమ్ములైనఁ బంపుట లేదు.

"దైవమా! సర్వనాశన మొనర్చుచుంటివా?" యని యామె తలంచుచుండెను. కొంతవడికి ధైర్యము తెచ్చుకొనెను. ఆమె కు స్త్రీజనసహజమగు హృదయ దౌర్బల్యము—కోమలభావ మంకురించెను. "అయ్యో! అబలనయ్యు నేనీ ప్రబలకార్యము జేయవలసి వచ్చినది. స్వయంవరమున శత్రువు కేవలము మోస మొనరించెను. నా ప్రాణనాయకుని నే నేవిధమునను జేరఁజాలను. ఈప్రబల శత్రువును జంపి కులగౌరవమును ని లువఁబెట్ట వలయును. నేనిప్పు డీతని నాపెద్దల యాజ్ఞానుసార మునఁ జంపినచోఁ బ్రాతఃకాలమున నీతని సైనికులు మా న గరమును భగ్నముసేసి మావారి నందఱను జంపివేయుదురు, సర్వనాశనమే!"—అమెకు భయము కలిగెను. మేలిముసుఁ గు వస్త్రములోనుండి శయ్యపైఁ బరుండియున్న విగ్రహము వైపునకుఁ జూచెను—దృష్టి మరల్చుకొనెను. అప్పుడు శయ నించియున్న రాయలు కదలి నట్లామెకు దృగ్గోచరమయ్యెను. ఆతఁడు లేచినచోఁ దనమానము దక్కదని తలంచెను. "ఛీ! ఈదాసీ పుత్రునికా—నాశీలమా!" ఆమె కాగ్రహ ముద్రే క మయ్యెను. వస్త్రములయందుఁ దాఁచి తెచ్చిన బాకు పైకి దీసి శయనించియున్న పురుషుని జటాలునఁ బొడిచెను. విగ్ర హము కదలినట్లు తోఁచెను. ఆతొందరలో నామె మేలిము సుఁగు మెడమీఁదికి జారిపోయెను. ఆవిగ్రహము నామె చూ

చెను. "హా! చచ్చితి" నని యామె క్రిందకుఁ బడిపోయెను. ఆమె శిరముపైఁ బిడుగుపడి నట్లయ్యెను. గదియంతయు నిశ్శబ్దముగ నుండెను. "ఆఁ! నేనేమి చేసితిని! నా మోహనమూర్తి ప్రాణము లపహరించితినా? నా చిత్రఫలకమునందలి తేజోమూర్తియే కృష్ణరాయలా? అయ్యో! నేను పొడుచుటకుముందాతని నేల చూడనయితిని? హా! హతవిధీ! నన్నధోగతిపాలొనరించితివా? తండ్రీ! నీ తనూజాతకు దుర్మరణము కలుగుటకుఁ గారణభూతుఁడ వైతివా? రాజాధిరాజగు నీయల్లుని నేను నీయాజ్ఞానుసారము నటికి నైచితినా? ఇంక నామనోవల్లభుఁడు లేడు. నేనేల జీవింపవలయును? ప్రాణనాయకా! నిన్నుఁ బొడిచిన బాకుతో నా ప్రాణముల వీడి, నీకడకు వచ్చుచుంటిని. ఇదిగో—" అని తిరుమల లేచెను. పొంచియుండిన కృష్ణరాయ లామె కట్టెదుట నిలువఁబడి యుండెను. బాలిక చూచి శయ్యపై విగ్రహమును గని వెనుకకుఁ దగ్గెను. "భయము లేదు. కృష్ణరాయఁడు నీ మనోవల్లభుఁ డైనచో నా తఁ డీతఁడే! రమ్మా! నీప్రణయవర్షము నీతనిపైఁ గురిపింపుము" అనెను. కృష్ణరాయని హస్తములు తిరుమలకు స్వాగతమిచ్చుట కభిముఖములయి యుండెను. బాలిక విషాదముతో విగ్రహమును జూచుచుండెను. "బాలామణీ! అది కల్పిత విగ్రహము. దిగ్భ్రాంతి నొందకుము. గజపతుల బాలికయు నిది

వఱకు నన్నుక్షత్రకులహీనుఁడని భ్రమించి నలుకవచ్చినది. మా మంత్రియగు తిమ్మరుసు నిన్న మీతండ్రి సంధిసమయమున నిట్లాలోచించునది విని యీ విగ్రహము నిచ్చిపోయెను. గజపతుల కన్యను నేను పరిత్యజించితిని. అట్లయ్యును నీరూప సౌందర్యములను నీసౌజన్యతను వింటిని. నీక్షాత్రమును నీకు నాపైఁగల ప్రేమమును బ్రత్యక్షముగఁ జూచితిని. మా మంత్రియు నీసరికి నీ జనకుని జేరి నేను మీదూరపు బందుగులగు క్షత్రియకన్య కుమారుఁడనే యని చెప్పి యొప్పించియుండును. కర్ణాటక రాజ్యరమ నా భుజములపై నుండియు సహవాసము నకు నాకు సహధర్మచారిణిని గోరి యచ్చటఁగూడ వసియింపఁ గుతూహల మొందుచున్నది." అనెను. ఆమె నూదంటు దాలిని హత్తు నినుపశలాకవలె నాతని కౌఁగిటఁ జేరెను. మఱి యొకరెప్పపాటులో నాతని గౌఁగిలించికొని యుండెను! అది దైవనిర్ణీతమగు నాకర్షణము. ఇప్పుడు బాలిక తల వంచుకొని దుఃఖించుచుండెను. రాయలది చూచి "తిరుమలా! తగదు. శోభన మహోత్సవ సమయమున దుఃఖమా? నీతండ్రి రాజ్యము నాకు వలదు. నేనంత రాజ్యతృష్ణకై న్యాయము నెరజేయువాఁడను కాను. ఇప్పుడుత్కల కర్ణాటక రాజ్యముల యభివృద్ధి నీచంచల కటాక్షములపై నాధారపడి యున్నది." అని రాయలు చిఱునవ్వు నవ్వెను. తిరుమల వదనమున మం

దహాస మొదవేను. గది యంతటను దరహాస చంద్రికలు వె ల్లివిరిసెను.

ఇంక నచ్చటి సంగతులు మనకేల? మఱికొన్ని దిన ములకుఁ బిమ్మట మేమీ తిరుమలను ప్రజలు "తిరుమలదేవి" యని వాడుచుండిరనియు నామె కర్ణాటభూపతియగు కృష్ణరా యని యర్ధాంగినియై యుండెననియు మాత్రము వినియుంటిమి

---

## ౪
## ఆశ.

(టాల్ స్టాయికథ కనుసరణము.)

నెల్లూరిమండలమునందొక పట్టణమునం దున్న యాఁ డుది పల్లెయందు వసియించుచున్న తన సోదరినిఁ జూచుటకుఁ బోయెను. ఆపల్లెయం దున్నవారి సామాన్య జీవితమును జూ చి యామె తన సోదరి నాక్షేపింప మొదలిడెను. పల్లెటూళ్ళ లోఁ బశులవలె నాహారముఁ దిని, కష్టపడి, నిద్రించుటతక్క సౌఖ్య మనునది లేదని పట్టణవాసి పల్కెను. దానికిఁ గినిసి పల్లెవాసి యగునాపె సౌఖ్యమంతయుఁ బల్లెలయందే కలదని యు, సంవత్సరము పొడుగునఁ దాము పాడిపంటలతో సుఖ కాలక్షేప మొనరించుకొందు మనియు, నగరములయందుండు

వారికి మఱునాఁ డన్నమెట్లు వచ్చునని విచారమే యనియు, నాటకములు, బండ్లు, ఖేలనములు, వినోదములు నని పట్టణవాసులు తిరిగి సౌఖ్యమనుకొని భ్రమనొందుదురనియు, నేఁడు జరీబట్టలతోఁ దిరిగి సుఖము సుఖమని కులికి, మరునాఁడే యన్నములోని కాదరువులేని దుస్థితియం దుందురనియుఁ జెప్పుచు పల్లెలయందుండు శాంతిప్రదమగు జీవితము వంటిది మీకు రాదని యక్క నధిక్షేపించెను.

ఈవాద మంతయుఁ జెల్లెలి మగఁడగు రామస్వామి వినుచుండెను. అతఁ డొకరైతు. విద్యలేనివాఁడు కాఁడు. తన వదినెగారితోఁ దనభార్య చేసినవాద మెంత సకారణముగ నున్నను, పట్టణవాసియగు వదినె వర్ణించిన నగరసుఖము లనుభవించుచు నాగరికుఁ డగుట కాతని కభిలాష మధికమయ్యెను. అతఁ డంతటఁ దన దుస్థితినే తలపోయుచుఁ ద్వరలో భాగ్యవంతుఁడను కావలయునని తీర్మానించుకొనెను. దానికిఁ దగిన ప్రయత్నములను జేయుటకే యోచించుకొనుచుండెను. "మాకు మంచిభూములే యుండినచో నీదరిద్రదేవతమిత్రముకు శని నైన నే లెక్కకు దీసికొనను" అని యతఁ డూహించుకొనుచుండెను. శనికీ యూహాలు తెలిసినవి. "మంచిది! ఈతనికి వలసిన భూములిత్తును. నన్నెట్లు లెక్కకుఁ దీసికొనఁడో చూతునుగాక!" అని శని తనలోఁ దానను కొనెను.

రామస్వామి కోరికలు త్వరలోనే సిద్ధించినవి. ఈతఁడిదివఱకుఁ గష్టించి కూడఁబెట్టిన స్వల్పధనమునకే, తన చేను లోచేనమ్మకమునకు వచ్చెను. ఆతఁడది కొనెను. వ్యవసాయ మభివృద్ధి నొందెను. క్రమముగా ధనవంతుఁ డగుచుండెను. "ఇంక నేఁబది యెకరముల భూమి యుండిన—"అని యాతఁ డనుకొనుచుండెను. దానికి వలసిన ధన మాతనికి మిగులుచుండెను.

కొన్ని సంవత్సరములు గడిచిన పిమ్మట నొకనాఁ డాతని యింటికి రాత్రివేళ నొక బాటసారి వచ్చి తలుపుఁ గొట్టెను. రాత్రి చీఁకటిగానుండి వర్షము కురియుచుండుటచేఁ గొంచెము తలదాఁచుకొనుటకుఁ దావిమ్మని యా బాటసారి పలికెను. రామస్వామి మంచితనమున నాతని నాదరించెను.

మఱునాఁ డుదయమున బాటసారి లేచి యామాటయు నీమాటయు మాటలాడుచున్న రామస్వామితో నిట్లు పలికెను. "నీ వేప్రసంగము చేసినను భూమి—ధనము— అను మాటలుతప్ప వేఱులేకున్నది. నీకు వలసినంత భూమి కావలయు నన్నచో నిచ్చట లేదు."

"మఱి యెచ్చట నుండును—"

"జయపురము రాజ్య మెఱుఁగుదువా?"

"ఎచ్చట నది?"

"ఓఢ్రదేశమున నున్నది."

"ఉండిన?"

"అచ్చట నీకు వలసినంత భూమియున్నది. వనముల యందుండు భూస్వాములు కోయవాండ్రు!"

"అయిన మన కాభూము లెట్లు వచ్చును?"

"వారి కేవియో రెండుమూఁడు విచిత్ర వస్తువులను, దుస్తులును, కత్తెరలు, బొమ్మలు, కోటులు, యిట్టి వస్తువుల నిచ్చినచో సంతోష పెట్టవచ్చును."

"అట్లు చేసిన —"

"నీ కెంతలాభము! నీవు కోరినంత భూమి నీకు వారి త్తురు."

రామస్వామి కన్నులయం దాశ్చర్యము ప్రకాశవంత మయ్యెను.

"ఊఱక యిచ్చివేయుటయే —"

"అచ్చట పన్నులుకూడ లేవు. ఒకవేళ నున్నను, నీవు కాడికట్టుకొని దున్నినభూమి యెంతైనను, నీవు కట్టిన నాగళ్ళపైఁ బన్నుకాని, భూమిపరిమితముపైఁ బన్ను లేదు.—"

"రామరాజ్యము-

"అవును. అట్టిదే! నీవాకోయవాండ్ర నడిగిన నెంత భూమినైన నిచ్చెదరు."

"ఏమి? మంచిభూములే?"

"ఇంతకంటె వేయిరెట్లు బలమైనవి."

"ఇదిగో! చూచితిరా! ఈభూమియంతయుఁ—బదునేను దినములైనది—మాయీనామదారుకడనుండియే కొనినైచితిని. ఈసరికి నాభూమియంతయు రెండువందల యెకరములైనది."

"ఇట్టిది రెండువేల యెకరములుకూడ నచ్చట సంపాదించుట కష్టముకాదు.

"మీరు సత్యముగఁ జూచినారా? అవి బలమైన భూములే?"

"సరిసరి!"

"నీటి యాధారము లుండునా?"

"ఆభూములు దున్నకుండ ఫలించును."

"ఆశ్చర్యమే!—అయితే—మంచి బలమైన భూములే అనెదరా?"

"మీకు సందేహ మున్నచో నీపత్రిము, జూచుకొనుఁడు—"

అని బాటసారి మూటవిప్పి కాగితమును జూపెను. రామస్వామి కాశ్చర్య మధికమయ్యెను. బాటసారి మాటలు సత్యమని నమ్మెను. అతనివలెఁ దానుఁగూడ రెండువేల యెక

రముగైన సంపాదించుకొనవలెనని యుత్సాహముచే నుప్పొంగి పోవుచుండెను. బాటసారియు నీ విషయములన్నియు వివరము గఁ జెప్పుచుండెను.

తుదకు రామస్వామి పత్రమునంతయుఁజూచి రెండు మూఁడువేల రూప్యములు వెచ్చించినచో నొక చిన్నరాజ్యమువంటి స్థిరమైనభూమి సంపాదింప వచ్చునని యనుకొనెను.

"అబ్బే! ఓఢ్రికోయవాండ్రు మిక్కిలి యమాయక హృదయము కలవారు. నీవంటివాఁడచ్చటకుఁ బోయిన వేలు లక్షలు సంపాదించుకొనవచ్చును. వారికి స్వల్ప బహుమానములు, మంచిమాటలు, చాలును. వారిచే నెట్టిపనియైనఁ జేయింప వచ్చును. సత్యసంధులు!" రామస్వామి కిదియంతయు నద్భుతముగ నుండెను. భాగ్యదేవత తనపై వర్షము గురియించుచున్నదని యాతఁడు తలంచెను. "దిక్కుమాలినదరిద్రి మీకఁ గాన్పింపదు." అని యాతఁడు భవిష్యద్రంగములఁ దిలకించుచుండెను. బాటసారి నింక వివరములన్నియు నడిగి తెలిసికొని, వెంటనే యిచ్చటనున్న పొలములన్నియు నమ్మివేసికొని, ధనము మూటకట్టుకొని, జయపురరాజ్యమునకుఁ బోవ నిశ్చయించుకొనెను. బాటసారి వెడలిపోయెను.

మరి పదునేను దినములకు రామస్వామి పొలము నిల్లు నమ్మివేసికొని జయపురరాజ్యమునకుఁబ్రయాణ మయ్యెను.

తనకుఁ జేరువనున్న నెల్లూరుపట్టణమునకు వచ్చి యచ్చట గావలసిన వస్తువులఁ గొని, కోయవాండ్రకు బహుమతు లిచ్చుటకుఁ గొన్ని యుపగూపములగు వస్త్రములు, కత్తులు, బొమ్మలు, కొని యొక సేవకునితో బయలుదేరెను. అచ్చటకు జయపురరాజ్యము చాలదూరము. ఇప్పటివలె రైలు మున్నగు మార్గములు లేవు. నాలుగైదు మాసములు ప్రయాణముచేసి రామస్వామి విశాఖపట్టణముఁ జేరెను. అచ్చటఁ గొంతవిశ్రాంతిఁ దీసికొందమని సేవకుఁ డనెను. కాని రామస్వామి యంగీకరింపలేదు.

తుదకు వారా కోయవాండ్రున్న దేశమునకుఁ బోయిరి. అచ్చట భూములన్నియు సారవంతములే. ఎచ్చటఁ జూచిన చెఱువులే! ఏరులే! కొంచెము కష్టపడిన కావలసినంతపంట! అన్నియు ఫలవృక్షములే! "భూము లేమిటి—బంగారము"ని రామస్వామి గంతులు వేయుచుండెను. కోయవాండ్రు నెట్లో మాయచేసిన, పిల్లపిల్లతరాంతము లుండును. మంచిభూమి దైన చూచుకొనుట మంచిదని యాతఁ డనుకొని యుబ్బూటలూఁగుచుండెను.

రామస్వామి కోయవాండ్రతో సులభముగా స్నేహము చేసెను. కోయవాండ్రు రామస్వామి తెచ్చిన బహుమతులకు నాతనిమాటలకుఁ గూడ సంతసించిరి. ప్రత్యుపకార

మేమిచేయఁ గలమని వారడిగిరి. తన భూమిమాట రామస్వామి చల్లగాఁ జెప్పెను. "ఓ! దీని కేమి?" అని వారు తమ రాజ్యములోని భూమినంతయుఁ జూపిరి. అనంత మగుసముద్రమువలెఁ బచ్చిక నిలువెత్తునఁ బెరిగి కనుచూపుమేర దాటి వ్యాపించియున్న యాకోయవాండ్ర భూముల నరణ్యములఁ జూచునప్పటికి రామస్వామి కానంద మత్యధికమై పోయెను.

ఆకోయనాయకుఁడు "నీకెంత భూమి కావలెను?" అని రామస్వామి నడిగెను. రామస్వామి నీళ్లు నములుచుండెను. ఇంతని చెప్పలేఁడు. అంతట నాకోయనాయకుఁడే "అయ్యా! రామస్వామిగారూ! మీరు మిక్కిలి మంచివారు. మీరు మాకిచ్చిన రెండువేల రూపాయిలకును మీకు వలసినంత భూమి నిచ్చెదము. కోయ లితరుల ఋణము తమపై నుంచుకొనరు" అని నుడివెను.

రామస్వామి మురిసిపోవుచుండెను. "ఏవైపుభూమి తీసికొందును? ఎంతని కోరుదును? మాటలో రాజ్యము వచ్చివేయునుకదా! అదృష్టమనఁగ నిట్లు పట్టవలెను. ఇప్పటికి నాయభీష్టములు తీరుచున్నవి. అని రామస్వామి తలపోసికొనుచు నుబ్బిపోవుచుండెను.

"అయ్యా! మీరింతభూమి యని చెప్పలేక పోవుచున్నారు. నా మాట వినుఁడు. ఇదిగో! ఈకొండశిఖరముపై నీకొన

ఆశ.

కడ మీ రెండువేల రూపాయలసంచిని బెట్టుచున్నాను. ఇచ్చటనే మీ సేవకునిఁ గూరుచుండఁ బెట్టుఁడు. మీరు సూర్యోదయముననే బయలుదేరి, కాలినడకను దిరుగుచు, సాయంతనమగులోపల మీరు చుట్టివచ్చిన భూమియంతయు మీయది. ఈ రెండువేల రూపాయిలు మీయవి. ఇంకొకమాట! సాయంతనమగు నప్పటికి మీరు మొదట బయలుదేరిన యీకొండకొనకు జేరలేనియెడల మీకీ భూమిరాదు, సరికదా! మీసొమ్ము బోవును." అని కోయదొర చెప్పెను.

రామస్వామి యీమాటలన్నియు నాశ్చర్యముగ విని, సంతోషముగ నంగీకరించి, యానందించుచుండెను. కోయనాయకుఁడు మఱల నియమములను జెప్పెను. "సాయంతనమునకు బయలుదేరినచోటకు రావలెను. పగలెల్ల మీరు చుట్టివచ్చిన ప్రదేశమంతయు మీయది! అని నిర్ధారణ మొనరించెను. మరునాఁడా రామస్వామి యుదయముననే బయలుదేరుటకును అతని వెంట గుఱ్ఱములపై నల్వురు కోయవాండ్రు వెంబడించుటకును, అతఁడు చుట్టివచ్చిన ప్రదేశమునకు గురుతుగా రాళ్ళు పాతి, ఆ భూమిచుట్టు నొకగట్టు వేయించుటకును, ఇఁక నా భూమి రామస్వామి శాశ్వతముగ ననుభవించుటకును, రెండువేలరూపాయిలుమాత్రము క్రియధనముక్రిందఁ గోయవాండ్రు తీసికొనుటకు నంగీకరింపఁ బడెను. "ఈప్రకారము క్రియపత్రి

ము వ్రాసి యీయవలెను. పిమ్మట మీపుత్రులు నాసుతు లను లేవగొట్ట వచ్చును. వ్యవహారము సరిగఁ బరిష్కరించు కొనుటయే ధర్మము"ని రామస్వామి పలికెను. కోయవాం డ్రందులకు సంతోషపూర్వకముగ నంగీకరించిరి.

మఱునాఁ డుదయమున పెంపలకడ లేచి సూర్యోదయ ము కాకమునుపే రామస్వామి కోయవాండ్రతోఁ గలసి కొం డకొనకు బయలుదేరెను. వెంట నన్నము మూటకట్టుకొని నీళ్లుపోసిన తాఁబేటికాయను దీసికొని రామస్వామి బయలు దే రెను. ధనము కొండకొనపై నుంచిరి. సూర్యుఁడు సరిగ ను దయించుసరికి రామస్వామి బయలుదేరెను. వెంట గురుతుల రాళ్లుపాతుటకు నల్వురు కోయయువకులు గుఱ్ఱములపై బయ లుదేరిరి. కొండకొనపై ధనముకడఁ గోయనాయకుఁడును రామస్వామి భృత్యుఁడును గూరుచుండిరి. రామస్వామి సాధా రణవేగముతో బయలుదేరెను. ఆతఁడు సారవంతమగు భూ మిని—వెడలిన కొలఁది మంచిదిగఁ గన్పట్టుచున్న భూమినిఁ జూచుచుఁ బోవుచుండెను. కోయయువకులు రామస్వామి చె ప్పిన చోటులనెల్ల రాళ్ళు పాతుచుండిరి. ఎనిమిదిగంట లగుస రికి పదిమైళ్లు రామస్వామి నడచెను. ఇంకను బైభూమి సార వంతముగఁ గన్పట్టుచుండెను. ఇప్పుడు కష్టపడినచో నాఁడు తాను చుట్టివచ్చిన భూమియంతయు శాశ్వతముగఁ దనదే

యగునుకదా! అని యాత్రికుడు తలపోయుచు నడచుచుండెను. క్రమముగ మధ్యాహ్న మైనది. కొంచె మన్నము తిని నీళ్లు త్రాగి మరల బయలుదేరెను. బరువని చెప్పులజోడు తీసి చేతఁబుచ్చుకొనెను. ఆతఁడు మలపు దిరిగెను. క్రమముగా నడువఁ జొచ్చెను. పొద్దు వాలుచున్నది. కొండశిఖరము మీఁద మనుష్యులైనఁ గన్పడుటలేదు. ఆతఁడు వడివడి వెనుకకుఁ దిరిగెను. చాలదూరము నడిచి వచ్చుచుండెను. పర్వత మింక నొకమైలు దూరమున్నది. సూర్యాస్తమయమగు లోపల నాతఁడు కొండకొనకుఁ జేరవలెను. ఇంక గడియ పొద్దున్నదో లేదో? ఆతఁ డొడలంతయుఁ జెమ్మటలు గ్రమ్మ యాయాసపడుచుండెను. పాదములు బొబ్బలెక్కి, ముళ్లు గ్రుచ్చుకొని పచ్చిపుండువలె నుండెను. అయిన నేమి? ఈకష్ట మెప్పుడు నుండునా? శాశ్వతసుఖమున కీమాత్రము కష్టము క లెక్కయా? అని యాతఁ డనుకొనుచుఁ బరువెత్తుటకుఁ బ్రారంభించెను. చెమ్మటలు గ్రమ్మి బట్టలన్నియుఁ దడిసి పోయినవి. ఆతని గుండెలు కలిమిలితిత్తులవలె నెగయుచుండెను. ఇప్పుడు పర్వత శిఖరముపైనున్న తన భృత్యునిమాటలుకూడ వినఁబడుచున్నవి. ఇంక నెంతయో దూరములేదు. సూర్యుఁ డెఱ్ఱబారెను. ఇంక నొక్క యరగజము క్రిందకు దిగినచో నిఁక సాయంతన మైపోవును. ఆతఁ డూపిరి బుచ్చుకొని చేత

నున్న చెప్పులజోడు పారవేసి, బలమును గూర్చుకొని యింకొక్క పరుగు బలముకొలఁది పరువెత్తుచుండెను. అతఁడు చుట్టివచ్చిన భూమి పరిమితియైన నొక్కసారి కనులార చూచుకొన వీలులేదు. కొండకొనపైనున్న కోయనాయకుఁడు చేతితో రామస్వామిని రమ్ము రమ్మని హెచ్చరించుచుఁ బిలుచుచుండెను. రామస్వామి సూర్యునివంకఁ జూచెను. సగము బింబము కనఁబడుట లేదు. నీరెండకూడఁ బోవుచున్నది. ఇంక దూరమెంతయో లేదు. రామస్వామి పరుగెత్తుచునే యుండెను. సూర్యుఁడు గ్రుంకిపోయెను. రామస్వామి కొన్ని బారలే పరుగెత్తవలసియున్నది. అతఁడు కడపటిసారి ప్రయత్నించెను. ఇప్పుడాతనికిఁ దన ధనముసంచికూడఁ గన్పడుచుండెను. ఇంక లెక్క రెండు బారలు. కొనమీఁద నున్నవారికింకను సూర్యబింబ మగపడుచున్నది. కోయనాయకుఁడు "బాపురే!" అని రామస్వామిని హెచ్చరించెను. రామస్వామి కాలిక్రింద రాయిజారి ధనముసంచి మీఁదకుఁ జాచిన చేతితోఁ బడెను. ఒకటి రెండంగుళములలో నాతఁడు పడిపోయెను. పొద్దు గ్రుంకెను. కోయనాయకుఁడు రామస్వామిని చేయి పట్టుకొని లేవఁదీయఁ బోయెను. ఆతని శరీరము చల్లఁబడి పోవుచున్నది. గ్రుడ్లు తేలనైచెను. ఆతఁ డెంతభూమిని సంపాదింపఁ గలిగెను! కోయనాయకుఁడు ధనముతో వెడలిపోవు

చుండ రామస్వామి భృత్యుఁడు తన ప్రభువున కారడుగులపొడవు గోయితీసి రామస్వామి నందుఁ బరుండఁబెట్టి మన్నుతో నాతనిఁ బూడ్చెను. మనుష్యున కెంతభూమి కావలెను? రామస్వామి సంపాదించినాఁడు!!!

## ౫

## అగ్న

ఆర్యావర్త దేశమును పాలించు ప్రభుఁ డొకనాఁ డొక దుర్గమారణ్యములోనికిఁ బ్రవేశించెను. ఆతఁ డెన్నియో మృగములను వేటాడి యలసి చల్లని యొక మామిడిచెట్టుక్రింద గుఱ్ఱమును విడిచి యుత్తరీయమును బఱచి పరుండెను. చెమ్మటలు గ్రమ్మిన శరీరముపై చల్లనిగాలి మెల్లగ వీవ నాతనికి హాయిగా నిద్రవచ్చెను. ఆతఁ డెఱుఁగకయే వ్రేలాడు మామిడికాయల గుత్తులఁ జూచుచు కనుమోడ్చెను. బ్రిన్సుమనుచు గుఱ్ఱము పచ్చిక మేయుచుండెను.

రాజిట్లు నిద్రించి కొంతవడి కొక స్వప్నమును గాంచెను. అందెవ్వఁడో కనఁబడి "నీ కింకొక గడియలో నొక దివ్య

పురుషదర్శనము కలుగును. ఆతఁడు నీయందనుగ్రహించి తన రహస్యములన్నియు వెల్లడించును. నీవు శ్రద్ధగ నాతని మాఁట లాలకించి లాభము నొందుము." అనియొక పక్షిరూపమునొంది రాజు నిద్రపోవుటకు ముందు చూచిన యాకులజొంపములలో దూరి యదృశ్యమైపోయెను. ఇది యేమిచిత్రమని యాతఁ డనుకొనుచుండఁగా నెద్దియో ధ్వని వినఁబడినది. ఆతని కన్నులు మిరుమిట్లు గొల్పినవి. ఆతఁ డులికిపడి లేచెను. ఆతని కంటికగపడుచుండు తేజోవంతమగు పగటికాంతియంతయుఁ గారుమబ్బులచేఁ గ్రమ్ముకొని నట్లయ్యెను. అది నిద్రయో మెలకువయో యాతని కేమాత్రముఁ దెలియుటలేదు. అప్పు డాతని కాశ్చర్యకరమగు భావములు కలుగుచుండెను. వెలుఁగుకాని చీఁకటికాని లేదు. ఒకవిధమయిన మబ్బుకాంతితోఁ గూడిన స్వప్నప్రపంచమునందలి రంగముల యందువలె నెద్దియో యర్థముకాని—యర్థమగుటకు వీలులేని—కాంతితో గూడిన రంగముల నాతఁడు చూచుచుండెను. "పక్షి చెప్పిన దివ్యపురుషుఁ డెవ్వరు? నే నిప్పు డెచ్చటనుంటిని? ఎన్నఁడు నెఱుఁగని యీప్రకృతి యేమి?" అని యాతని బుద్ధియం దేమియో సంబంధములేని యాలోచనములతో గుబ్బటలుపడుచుండెను. అతఁడు కొంచెము కదలెను. తళుక్కుమని కాంతియొకటి యాతని కన్నులయెదుటఁ గాన్పించెను. ఆకాంతియే

యాతని కించుక దూరమున నధికమయ్యెను. ఆతఁడు బరిశీలింప నా తేజఃపుంజమునకు నడుమ ధుమధుమలాడుచున్నట్లు, నవ్వుచున్నట్లు గంతులువేయుచున్నట్లు, సంభాషించుచున్నట్లు మిక్కిలి పనిగలిగియున్నట్లెవ్వియో శక్తులు చైతన్యయుక్తమగు లీలలు నున్నట్లు కన్పట్టెను. కొంతవడికి వైలక్షణముల న్నియుఁ గలయొక బాలుఁ డచ్చట గూరుచుండెను. ఆతఁడు రాజును జూచి నవ్వుచుండెను. రాజాశ్చర్యపడి,

"మీ దేయూర" ని యడిగెను.

"దేవతల కూళ్లు పల్లెలు లేవు. ఎక్కడనైన నుందురు."

"మీరు సాధారణముగ నేయూర నుందురు? మీ పేరేమి?"

"నే నన్ని యూళ్లయందు నుందును. ఏమూలనో యుండుననుఁ జూచువా రెవరు?"

"ఏల చూడరు?"

"నాసంగతి తెలియక —"

"మీరు దేవతలా?"

"అయిన నేమి? మీకు సేవకుఁడ నగుటకు వచ్చితిని."

"అంతమాట సెలవీయఁ దగదు."

"మీ రట్లనరాదు. మీరు నారహస్యము నెఱుఁగక నన్నుఁ బూజించిన భక్తులు. అందువలన మీ కుపకారము చే

య వచ్చితిని."

"మీ చరిత్రమేమి?"

"చరిత్రమున కేమున్నది? నాతండ్రి శ్యామల స్వాహా పుఁడు. ఆతనికి విలక్షణమగు తేజమును, గుణములును గల న న్నాతఁ డసహ్యించుకొనును. నే నాతని కడనుండినఁ జంపివే యును. మఱియు నన్నెల్లప్పుడు నోరులేకుండఁ జేయఁ దలం చును. నాతండ్రి లోకమున సాధుజనవంటివాఁడు కాఁడు. న న్నాతఁడు భరింపఁ జాలఁడు. ప్రేమయు లేదు."

"ఇప్పుడు మీ యునికి—"

"వనములలో—ఇండ్లలో—గుడిసెలలో—ఎక్కడ చోటుదొరకిన నక్కడ—"

"మీ తండ్రికి వినయముతో నుండవలదా?"

"ఆతఁడు చేయుపని నేనును జేయఁగలను. కాని యాత నివలెఁ జేయఁజాలను. అతనికి నాకును బడదు."

"ఇప్పుడు మీ రెక్కడకుఁ బోవుదురు?"

"ఎవరు రమ్మన్న వారికడకుఁ బోవుదును"

"మీకు భుక్తి యెట్లు?"

"సేవకవృత్తి వలన."

"మీ కిఁక బంధుగు లెవ్వరు లేరా?"

"మా తాత యొకఁ డున్నాఁడు. ఆతఁడు కనఁబడిన

నాకు మిక్కిలి యుత్సాహజనకముగ నుండును. ఆతఁడొ
క్కొక్కప్పుడు దర్శనమే కలుగనీయఁడు. నేనప్పుడు దుఃఖ
ముతో మొగము కప్పుకొని యుందును. ఆతఁడు వెఱ్ఱివాఁడు!
వెఱ్ఱిప్రేమచే నెచ్చటకైనఁ బోవుచు "రావోయి!" అని యఱ
చుచు నన్నుఁ బిలుచును. కర్మము! నాది మాతాత ప్రకృతియు
నైనదికాదు. ఆతఁడు నిరాధారముగ నెల్లకాలఁది పరువె
త్తును. నేనట్లు పోఁజాలను. నాకెచ్చట కచ్చట పరాపేక్ష
యధికము. అందువలన మాతండ్రితాతలతో నే నెల్లప్పుడు
నుండ వీలులేదు. నాది శాంతస్వభావము. నన్ను నే ప్రాగను
కొనఁ గూడదు—కాని నన్ను రెచ్చపెట్టినయెడల నాకుఁ గో
పమధికముగవచ్చును. మాతండ్రి వచ్చినప్పుడు నన్ను కొట్టిన
ను నేను మాటలాడను. కాని మాతాతయెదుట నన్నెవ్వరై
నఁ గదిపిన మింట నంటుదును. గంగిగోవువకుఁ గోపము వచ్చి
నట్లే శివమెత్తి యాడుదును. కాని యెప్పుడైన నేఁడుదునం
దో యే యడవియందో నాప్రతాపము కాని యితర ప్రదేశ
ములయందు నే నగపడను. నా కాహారము పెట్టినవాలఁది ను
త్సాహము నొందుదును."

"మీ చరిత్రమంతయు గూఢముగ నున్నది. నాకేమి
యుఁ దెలియుట లేదు. కాని మీ పూర్వుల గొడవ మాకెం
దులకు? ఇప్పుడు నాతో మీ కేమిపని?—"

"అంతయు నీతోడనే యన్నది. నీవు రాజవు. నేను సేవకుఁడను."

"మీరు దేవతలు —"

"కావుననే మీ నరులవలె నాకడ నవకతవక లుండవు. ధర్మమే నా మార్గము."

"ఇప్పుడేమి చేయుమందురు."

"నన్ను మీ భృత్యకోటిలోఁ జేర్చుకొని నావలన నగుపనులు చేయించుకొని సుఖపడుమందును."

"మీ రేమి పనులు చేయఁగలరు?"

"వెఱ్ఱివాఁడా! దేవతల కలవికాని పను లెవ్వి కలవు? పిపీలికాది బ్రహ్మపర్యంతము సకలజీవరాశికి—నందు ముఖ్యముఁగ మనుజులకు—నా యవసరము లేనిగడియ లేదు."

"మీ రేమి పనులు—"

"చెప్పెదను వినుము. బియ్యము దంపుదును. బట్టలు నేయుదును. పిండి విసరుదును. బండ్లు లాగుదును. ఇండ్లకలప కోయుదును. బరువులు మోయుదును.—"

"ఇదియంతయు నసత్యము —"

"వెఱ్ఱివాఁడా! పరీక్షింపుము. న న్నేపని చేయుమన్న నదియే చేయుదును. చేయించుకొను నేర్పు నీయది కాని నాది కాదు—"

"మీకంత బల మేది?"

"దేవతలు కామరూపులు— శత్రువులఁ జంపుదును. గానుగులు త్రిప్పుదును. ఏపని చెప్పిన నది చేయుదును. పరీక్షించు కొనరాదా?"

"మీకు జీత మేమి?"

"నాకు వస్త్రములయిన నీకు నక్కఱలేదు. కాలే కడుపునకు మండే బూడిదె. ఇంత కడుపులోని కేదియైనఁ బార వైచిన నది తినుచు నేపనియైనఁ జేయుదును. త్రాగుట కిన్ని నీళ్ళిచ్చిన చాలును." (తనలో) ఈవిధముగనైన నాతండ్రిని సంహరించెదను. తాత బలవంతుఁడైనను నష్టము లేదు. తండ్రినిఁ జంపి తాత కూపిరిపోయువాఁడ నందును. తండ్రికంటెఁ దాత మిగుల పూజార్హుఁడని సమాధానము చెప్పవచ్చును.

"ఇంత చౌక సేవకుఁ డెట్లు దొరకును? ఐన నీగర్వము లేమియో చూతము. ఈపనులన్నియు నెట్లు చేయునో?" అని రాజు తలపోయుచుండెను.

"మేము దేవతలము. మీరు నరులు. నేను మీకడ భృత్యుఁడనైనను నన్ను మీరంట రాదు. అంటిన మీకే నష్టము. ఇట్టి స్వాతంత్ర్యము మా కీయక తీరదు. ఇంకొకటి! నేను మొదలే చెప్పుచున్నాను. తిండిపోతును. నా కాహారము పెట్టినకొలఁది నేను చేయుపను లెక్కువగుసు."

"మీకు భోజనమునకుఁ బ్రియపదార్థము లెవ్వి?"

"ఏమైన సరియే! మీనరులు తినని వేవైన సరియే!"

"అనఁగా! నాకుఁ దెలియలేదు."

"అబ్బ! ఏమి చెప్పను? ఏకట్టెలో, కంపలో పారవే యుమయ్యా! ఇన్నిపుల్లలో, పుటికలో, బొగ్గులో నా మొగము వఁ జూరవైచినఁ జాలును. తెలిసినదా?"

రాజిట్టితిండి తినువాఁ డెట్టిపనిచేయునా యని యోజించుచుండెను.

"దాహమునకు నీళ్ళు! ఇవి చాలును. నాతండ్రిని సంహరించుటకు నే నీ సేవకవృత్తి నవలంబించి నరులకు లోఁబడుచున్నాను. లేకుండిన మీకు నే లొంగుదునా?"

"ఆఁ!" అని రాజాశ్చర్యము నొందుచుండెను.

"మీకు బని కావలసినప్పుడే నాకాహారమును బెట్టుఁడు, పనిలేనప్పు డక్కఱలేదు. సరియా—పుల్లలో, బొగ్గులో, కంపలో—సున్నమో—గబ్బునూనెయో—ఏదియో మీకుఁ బనికిరాని దేదియయిన నాకుఁ దినుటకుఁ బనికివచ్చును. వేలకొలఁది మనుజుల మోయుదును. వేలకొలఁది మైళ్ళు ప్రయాణము చేయుదును. పిలిచినప్పుడు పలుకుదును. వేసవిని విసరుదును. శీతకాలమునఁ జలి పోఁగొట్టుదును. వానకాలమే నాకు శత్రువు. అప్పుడయిన మీలోనున్నది. అప్పుడైనఁ

దినుట కేమైన నిచ్చిన నప్పుడుకూడఁబనిచేయుచునే యుందును. రాత్రింబవళ్లు విసుగులేక చేయుదును. సరియా? నరులు వె ఱ్ఱివారు! కొంతకాలము నేడాఁగు ప్రదేశము తెలియఁగక న న్నారేయుంబవళ్లు రక్షించిరి."

"మంచిది!"

"ఇంకొక్క విషయము! నాకుఁ బనిలేకున్న నాహార ము నీయకుఁడు. ఇచ్చిన నూరకఁ గూరుచుండఁ బెట్టకుఁడు. నేను మానవునకు వలసిన పనులెల్ల చక్కబెట్టుదును. నన్ను మానవులు చిరకాలమునుండి భక్తితోఁ బూజించుచున్నారు. నాకెప్పుడు నాహారమిచ్చి మెచ్చుటకుఁ బోకుండఁ బెట్టుకొని నారు. ఇప్పుడంత యాహార మీయనక్కఱలేదు. నే నేరాత్రి యందో దాగియుందును. మీరెప్పుడు పిలిచిన నప్పుడు పలుకు నట్లు చేసికొనియే యున్నారు. కాని నా సంపూర్ణశక్తి నెఱుఁ గక యున్నారు. పూర్వమువలె పిల్లవానికిఁ బెట్టినట్లు కొలఁ దిగ నాహార మిచ్చుట కిప్పుడు సరిపడదు. అందువలననే పూ ర్వము తప్పించుకొనిపోయి మా తాతతో వనములెల్లఁ దిరిగి ధ్వంసము చేయువాఁడను. ఇప్పుడైన నన్ను జాగ్రతగా బం ధించి, పనిలేనప్పు డాహారమీయక కాపాడనియెడల మీ న గరములఁగూడ ధ్వంసము చేయుదును. నాకుఁ దగిన పీఠము లు, నాహారము నిచ్చిన సూర్యచంద్రులు లేనిలోపము లేకుండ

మీకుఁ బనులగడపుమను. చిమ్మచీకటిలోనైన మీవెంటవచ్చి మీకు దారిఁజూపి పను లొనరింతును. ఆహారపదార్థములు భుజింప నర్హములుగనొనరింతును. మీరు కోరిన పనులెల్లఁ జేయుదును."

"మీ నామధేయము!"

"ననాంగ్లేయులు "ఫైరు" అందురు; తురకలు "అంగారు" అందురు. హిందువులు "అగ్ని" అందురు, కొందఱు "అగ్గి" అందురు. అనాగరికులు నన్ను "అగ్గినిప్పు" అందురు. అడియే నాకు సరియైన పేరనుకొందును."

"మీరా? అగ్నిదేవా! మహానుభావా! వందనములు. ఇంతవఱకు మీరెవ్వరో తెలియలేదు. మీరు మాకుఁ గొత్తవారు కారు—"

"తెలిసినదా! నాశక్తి మీకుఁ దెలియుదా? నా తండ్రియగు జలము నన్నార్పును. అందువలన యంత్రములఁ గల్పించి యందు నీరుపోసి నన్ను దాకొల్పిన నాతండ్రిని మసలునట్లుగాచి, నా తాతయగు వాయురూపము (Steam) నొందునట్లు చేసి కష్టపడు మానవులకు సకల కార్యములుచేసి నా తండ్రిపై పగఁ దీర్చుకొందును."

"దేవాంశసంభూతులరగు మీరిట్టి దుర్బుద్ధితోఁబితృభక్తిపరాయణులగు హిందువులకడ గౌరవము నొందఁజాలరు.

మీా పనులు మా కక్కఱ లేదు—"

"అట్లయినఁ బాశ్చాత్య దేశములకుఁ బోవుదును." అని యా దివ్యస్వరూపుఁడగు నగ్న యదృశ్యుఁ డయ్యెను.

గుఱ్ఱపు సకిలింపుతో రాజు మేల్కాంచెను. ఈస్వప్న మంతయుఁ బునర్విమర్శన మొనరించుకొనెను.

## ౬

# మహాలక్ష్మి.

—♦—

(ఎంతపనిఁ జేసితివే!)

"చిత్తము! ఇది కేవల మన్యాయము. నా కుమారుని, నాకంటె వారెక్కువగ నెఱుఁగుదురా? మాయచేసి న్యాయాధిపతిని నమ్మించి మోస మొనర్చిరి. నాభర్త సంపాదన మనుభవించుటకు నాకు వీలులేకపోయెను. ధర్మప్రభువులు నా విన్నపమును సావధానముగ తమరు చిత్తగించి న్యాయ మొసఁగవలయుదు." అని యేఁబదరువది సంవత్సరముల వితంతువు మేలిముసుఁగు వేసికొని, విచారవదనముతో ధర్మప్రియమహా రాజు గృహమునందలి రహస్యమందిరమున విన్నవించుకొను

చుండెను. ధర్మప్రియుఁడు వితంతు వొసఁగిన విన్నపపత్రము ను జాగరూకతతోఁ జూచుచుండెను. "ప్రభువర్యా! తమరు ధర్మప్రియులని సార్థకాభిధానులై యుండిరి. అనాథనగు నేను వెడలిపోయిన పుత్రుని కొఱకే, దుఃఖముతో కృశించుచుండ కోడలు పుత్రుని యాస్తికి వారసునని ముందు నాతో కలహించి యొక యభియోగము నిదివఱకు తెచ్చెను. కాని యది న్యాయమూర్తి నా పుత్రుఁ డగపడువఱకు నిర్ణయింప లేమనియు నధమ మిరువది సంవత్సరములయినఁ గడచినఁగాని యామె కొమరుఁడు న్యాయస్థానమున మరణించి నట్లెంచి తీర్పుఁ జేయ వీలులేదనియుఁ బరిష్కరించెను. వారు చేయునది లేక కొమరితమానము మంటఁ గలిపి; కేవలము ధనాశాపరత్వమున, పరుని తమ యల్లుఁడని సాక్ష్యముఁ జెప్పించి, యభియోగము తమ పక్షమునఁ బరిష్కరింపఁ జేసికొనిరి. నాకు సంవత్సరమున కేఁబది రూప్యములు మనోవృత్తి నొసఁగుచున్నారు. అదియయిన ముప్పతిప్పలఁ బెట్టియిచ్చుచున్నారు" అని యేమేమియో చెప్పుచుండ రాజు "మంచిది. నీవు దర్బారునకు రానవసరములేదు. నీ పరోక్షమున ముందు వారు చెప్పు వాదముల వినెదను. సాక్ష్యము ననుసరించి సాధ్యమయినంతవఱకు న్యాయ విచారణ మొనరించెదను. మేమయిన సత్యమిది యని నిర్ణయించుటకు దైవజ్ఞులము కాముగద?" యని రాజు ప్రత్యుత్త

రమిచ్చి రాధాదేవిని పంపివేసెను. రాజున కీయభియోగ మేమియు నర్థము కాలేదు. తీవ్రముగ నాలోచన మొదరించెను. “రామశాస్త్రి ధనాశాపరుఁడే; కాని యంతమాత్రమున తనూజాతమానము కేవలము ధనముకొఱకు వమ్ముఁజేయునా? పోయిన కొడుకు కిట్టివాఁడని యీమెయుఁ జెప్పజాలకున్నది. ఛాయాప్రతిబింబమైన లేదు. చిత్రకారుని ప్రతిమ యిటీవల కల్పించినదై యుండవచ్చును. రామశాస్త్రి తన సోదరి రాధాదేవి యనిఖైన సెంచక యాస్తికొఱకు కింత చేసి యుండుననుటకు వలనుపడదు. వెంకటేశ్వరుఁడు తన తల్లికై యేల జాలిపడఁడు చెపుమా? భార్య వలయందు తగిలి యీమె నగౌరవించెనా? ఏమియు తోఁచకున్నది.” అని తటపటాయించుచుండెను. రాజున కీయభియోగ విచిత్రములను శ్రద్ధగ విచారించి సత్యము నెఱిఁగి ప్రకటింపవలయునని గాటమగు పట్టుదల కలిగినది. అనేక విధముల ప్రయత్నించి చూచెను. కాని లాభము కలుగలేదు. రామశాస్త్రి ప్రభృతులను బిలిపించి కఠినముగ విచారించెను. కాని వారు ముక్కాకలఁ దీఱియుండుటచే నొక్కటాకీని సాక్ష్య మిప్పించుచుండిరి. సత్యము బయలుపఱచు ననుమానము కాని, యవకాశము గాని కనఁబడుటలేదు. రాజు బాగుగ నాలోచించి యభియోగమునకు మరియొక దినము నిర్ణయించి నడుమ గూఢచారులఁ బంపికూడఁ బ్రయత్నముల నొ

సరించెను. కాని రాజున కేమియు నుపయోగము కలుగ లేదు.

రాధాదేవి తన విన్నపము రాజేమి చేయునో, సత్య మెట్లు బయలుపడునో యని మిక్కిలి విచారముతో దినములఁ ఋచ్చుచుండెను. ఆమె యింటియం దుండుటకు సోదరుఁడగు రామశాస్త్రికాని, కోడలుకాని యంగీకరింపలేదు. పుత్త్రుఁడు వచ్చెనని మొదట రాధాదేవికి తెలిసినను తల్లితోఁ గలసిన యభియోగము చెడునని కాఁబోలు నాతని రాధాదేవిని చూడనీయరైరి. న్యాయస్థానమున రామశాస్త్రి తన యల్లుఁడని తీసికొని వచ్చిన యువకుఁడు రాధాదేవి తన పుత్త్రుఁడు కాఁడని వాదించెను. కాని న్యాయాధిపతి కుమారున కాస్తి యీయవలయునని తల్లి యిట్లు వాదించుచున్నదనియు, రెండవవయపు సాక్ష్యము బలవంతముగ నుండుటవలనను, నాతఁడు పుత్త్రుఁడు కాఁడని రాధాదేవి రుజువుపఱచుట కామెకు సాక్ష్యము లేనందునను ఈతఁడే కుమారుఁడని స్థిరపరచి న్యాయమూర్త్తి యభియోగము నిదివఱకు పరిష్కరించెను. రాధాదేవి చేయునది లేక, పొరుగింట నిప్పుడు దినములఁ ఋచ్చుచు, నాయింటి యందలి యొక పురుషుని సలహా సహాయములను జూచుకొని, యిప్పుడు దయాపరుఁడగు ధర్మమూర్త్తిని విన్నపముతో పోయి చూచి, పునర్విచారణ కభియోగముఁ దెచ్చెను. ఆయభి

రోగ మేమగునో యనియు, పుత్రుఁడు పసునాఅవయేట నే పారిపోయియుండుటను, భర్త మరణము వలనను, పువ్వు లమ్మిన యూరనే కట్టె లమ్మవలసి వచ్చినదని రాధాదేవి కంటికి మంటికి నొక్కటేధారగ నేడ్చుచు దినములఁ గడపు చుండెను.

అప్పు డామె యుండిన యింటికొక యువకుఁడు, ఇరువది సంవత్సరముల వయస్సువాఁడని నిర్ణయించుటకు వీలగు వాలకముఁగలవాఁ డొకనాఁడు వచ్చి "యిచ్చట ముప్పరువు రాధాదేవిగా రున్నారా?" యని ప్రశ్నించెను. "ఏమినాయనా! యెవరు బాబూ?" యని జలపూరితములగు కన్నులను దుడుచుకొనుచు రాజు పంపిన భృత్యుఁడేమో యని రాధాదేవి తలుపు తెరచెను. "అమ్మా! యెన్ని దినములకు నిన్నుఁ జూచితి" నని యాపురుషుఁ డామె కాళ్ళపైఁ బడెను. ఆతని లేవఁదీసి కొంత వినోదముతోడనో, సందేహముతోడనో, సంతోషముతోడనో, భయముతోడనో చూచుచు, రాధాదేవి యాతని కొన్ని ప్రశ్నలు వేసెను. ఆతఁ డన్నిటికి సరిగా సమాధాన మొసఁగెను. ఈయింటియందేల యుంటివని యాయువకుఁ డారాధాదేవి నడిగెను. కుమారుఁడే యని రాధ సంతసించి, యానంద బాష్పముల విడుచుచు, కొంతవడికిఁ దెప్పిరిలి "భోజనమునకు లెమ్మా? వారింట నన్నమున్నది. పిమ్మ

టఁ దెలిపెద" నని యాపురుషుని రాధాదేవి కోరెను. "నేను నీసంగతి వినువఱకు భోజనము చేయనని యాపురుషుఁ డనెను. అప్పుడు రాధాదేవి "వెంకటేశ్వరా! నీవు ఒకటి—రెండు—మూడు—నీపెళ్లియయిన మూఁడవయేఁట వెడలిపోయితివి. అప్పటికి (మరల లెక్కపెట్టుకొనెను.) పదునాఱవయేఁటఁ బోయితివి. పిమ్మట నీభార్యచే నీమామగారు వ్యాజ్యము వేయించి యోడిపోయెను. కొన్ని దినములకు నీవే వచ్చితివని ప్రకటించి యొకముద్దువిధవను కూఁతురునకు గర్భాధాన మొనరించి యాతఁడే నీవని యాతనిచేత వ్యాజ్యము తెప్పించి యాస్తినంతయుఁ దీసికొనెను. నాకు సంవత్సరమున కేఁబదిరాళ్లు మనోవృత్తి, కోడలు పసుపుపాలు, అటువంటి భర్తచావు, కొడుకుపోవుట, నాయనా!" యని రాధాదేవి కొడుకును కౌఁగిలించుకొని గోలుగోలున నేడువసాగెను. నలుగురు పోగయిరి. నీవు నీకోడలి నెప్పుడైన "వ్యాజ్యమయిన పిమ్మటఁగాని వ్యాజ్యమునకుఁ గాని చూచితివా?" యని వెంకటేశ్వరుఁ డడిగెను. "ఇంక నాకోడలేఁ? కులము చెడిపోయినది. ఆస్తి వచ్చినదని సంబరమా? వెలివేసినారు. నాలుగు సంచులు ఖర్చుపెట్టి స్వాములవారి దగ్గఱనుండి శుద్ధపత్రిక తెచ్చుకున్నారఁట. ఏగంగలో దిగిన మనకేమి? మనయాస్తి—"యని రాధాదేవి యనుచుండఁ లోపలికిరమ్మని వెంకటేశ్వరుఁడు తల్లినిఁ దీసికొని

యామె నివసించు భాగమునకుఁ బోయి రహస్యముగ మాట లాడుచుండెను.

అభియోగవిచారణదినము వచ్చెను. రాజు స్వయముగ విచారణముఁ జేయఁ బ్రారంభించెను. వెంకటేశ్వరులు తాను తన పదియాఱవయేఁట నొక మిత్రుని ప్రోత్సాహమున దేశాంతరము పోయితి ననియు, నప్పటినుండియు మైసూరు దొరతనమువారి కొలువున నుంటిననియు, కొన్నిదినముల క్రిందటనే తన యాస్తియంతయు భార్యపరమగుటకు సిద్ధముగ నున్నదనివిని, బయలుదేరి వచ్చితిననియుఁ జెప్పెను. సాక్షమేమియని రాజడుగ, మైసూరు దొరతనమువారు తన కేడెనిమిది సంవత్సరములక్రింద నొసఁగిన యుద్యోగనిర్ణయపత్రికను జూపెను. రాజు పరిశీలించుచుండెను. ప్రతివాదులు భయంకరధ్వానములతో, "తల్లి యీపురుషుని కుమారుఁడని తీసికొని వచ్చి, యాస్తికొఱకు వాదించు చున్నదనియు, నీతఁ డామె కుమారుఁడు కాఁడనియు," వాదించుచుండిరి. రాజు "ఇఁక నేమయిన నాధారములు కలవా?" యని ప్రశ్నించెను. అప్పుడు వెంకటేశ్వరునిన్యాయవాది, శాస్త్రియల్లు నీవిధముగ ప్రశ్నించెను. "నీకు బాల్యమున టీకాలు వేసినారా?" "లేము" అని శాస్త్రియల్లుఁడను నాతఁడు ప్రత్యుత్తర మిచ్చెను. అప్పుడు వారు వెంకటేశ్వరునకు చిన్నతనమున టీకాలు వేసి

నట్లును; అందు కుడిచేతిపై రెండు, ఎడమచేతిపై నొకటి పొక్కి-నట్లును, తెలుపు ప్రబల నిదర్శన పత్రమును దాఖలుజేసిరి.

రాజిరువురు పురుషులను, తత్పత్రమునందలి విషయము లతో పోల్చి పరీక్షించెను. వెంకటేశ్వరునకు యావదాస్తియు పూర్వపు టాదాయముతో రామశాస్త్రి యొప్పచెప్పవలయు నని డిక్రీ (తీర్పు) నొసంగుటకు సిద్ధముగ నుండెను. అప్పుడొక బాలుఁడు ప్రజామధ్యమునుండి ముందునకు వచ్చి రాజున కు నమస్కరించెను. రామమూర్తిని జూచి వెంకటేశ్వరు లాశ్చర్యపడి "ఈతఁడే నాకీ వర్తమానమును దెలియఁ బఱచిన" దని రాజుతోఁ జెప్పెను. రామమూర్తి తత్క్షణమిట్లు చెప్పఁ దొడఁగెను. "అయ్యా! నా తండ్రియగు రామశాస్త్రి తన యల్లుని ధనస్వీకరణమునకై చేసిన మాయలు నేనెఱుంగుదును. ఆతఁడొక పరపురుషుని దెచ్చి తనూజాతకు భర్తగాఁ జేయుటకుఁ బ్రయత్నించెను. ఆమె యిలువెడలి పాఱిపోయినది. రామశాస్త్రి తనూజాత యిప్పు డింట లేదు. వలసినేని రామశాస్త్రి కామాక్షిను తెప్పించుటకాజ్ఞ యొసఁగుఁడ"ని రామమూర్తి చెప్పెను. రామశాస్త్రి తెల్లఁబోవుచు రామమూర్తి నెగాదిగఁ జూచుచుండెను. తుట్టతుద కానవాలుపట్టి "మహాలక్ష్మి ఎంతపనిఁజేసితివే!" యని రామమూర్తిని కౌఁగిలించుకొనియెను. అందఱు నాశ్చర్యముతోఁ జూచుచుండిరి. అప్పుడుదుఃఖముతో

రామశాస్త్రి రాజు వైపునకుఁ దిరిగి యీవిధముగఁ జెప్పఁదొ డఁగెను. "నా యల్లుఁడు పారిపోయిన పిమ్మట నాకును, నాసో దరియగు రాధాదేవికిని కలహములు జనించినవి. ధనవ్యయ మునం దామె నామాటలు వినక నోములని, వ్రతములని వ్య యపఱచుచుండెను. నేనీ పన్నుగడవేసి నాకామంత్రి నాకొ త్తపురుషునకు భార్యను కమ్మని కోరితిని. అతఁడు (నాయల్లు డు) మరణించి యుండునని తలంచి యిట్లు చెప్పితిని. ఆమె కొన్నిదినములైన పిమ్మట నావాక్యము లనిష్టములై పారిపో యినది. అప్పుడొక వేశ్యను దెచ్చి యీకొత్త పురుషుని య ల్లుడని చెప్పి వ్యాజ్యము సాగించితిని. అల్లుఁడు మిక్కిలి య నుమానస్థుఁడు, భార్యను బయటికి రానీయఁడని, యితరుల నుమానింపకుండ వేశ్య నింట నుంచితిని. ఈపాపకార్యమున కు— కేవలము ధనాశచే చేసిన యీమహాపాపకార్యమునకు నాకు పశ్చాత్తాపము కలిగినది. నాకూఁతురు నల్లుడుఁ గనుపిం చిరి. వారికి నాయాస్తియేఁగూడ నీయాస్తి నిచ్చివేయుఁడు. నేను మిక్కిలి దురాత్ముఁడను. పాపాత్ముఁడను. నాయందు దయయుంచి నాకురికి సెలవిప్పింపుఁడ" ని రాజును ప్రార్థించె ను. రామమూర్తి ప్రక్క గదిలోనికిఁ బోయి మహాలక్ష్మినై వచ్చి యత్తగారివద్ద తలవంచుకొని నిలువఁబడి యుండెను. వెంకటేశ్వరులు మహాలక్ష్మిని క్రీగంటఁ జూచుచు, మరలఁ

దన్నితరులు జూచుచుండిరని భయమున చూపులు మరల్చు
కొనుచు, ఆమె ధైర్యసాహసముల కచ్చెరువందుచు, నాందో
ళన పడుచుండెను. వెంకటేశ్వరులు జయము నొందెను. రా
ధాదేవి సంతోషపడెను. రామశాస్త్రి ప్రభృతులకుఁ జెఱసా
ల ప్రాప్తించెను. మహాలక్ష్మి ప్రార్థనల ననుసరించి కఠినమైె
దుశ్శిక్షను రాజు రామశాస్త్రికి సాధారణ శిక్షగా మాత్రము
తగ్గించెను.

కథావిధానము యథావిధిగ జరుగకుండునా?

## ౭

# సుభాషిణి.

(స్వయంకృతాపరాధము.)

## ప్రథమ ప్రకరణము.

మోహనరావు చందనపురము "సెక్షను" సబుఓవరు
సీయరుగా" నుండెను. ఈతఁడు "ఓవరుసీయరు" పరీక్షయం
దుఁ గడతేరి యాఱుమాసములకిందటఁ బనిలోఁబ్రవేశించెను.
పనిలో ననుభవములేని వాఁడైనను, మిగులఁ దెలివితేటలతోఁ
బనిచేయుచుండెను. ఈతని కిరువదిరెండిరువదిమూఁడు సంవ

త్సరములకంటె నెక్కుడు వయస్సులేదు. పసితనము నందలి చిహ్నము లింకను మార్పు జెందలేదు. ప్రథమకళా పరీక్ష యందు విజయము నందిన వెనుక సీతడు "ఓవరుసీయరు" తరగతిలోఁ జేరి విజయము నొందెను. విద్యార్థులందఱివలెనే సంఘసంస్కరణాభిలాష యధికముగఁ గలవాఁడు. తలిదండ్రులు తగిన యుపపత్తి గలవారగుట సీతని కనేక సంబంధములు వచ్చుచుండెను. రజస్వలానంతరవివాహ మొనరించుకొనుటకుఁ గోరిక కలవాఁ డగుటచే సీతఁ డాసంబంధముల నన్నిటిని నిరాకరించుచుండెను.

కళాశాల యందున్నప్పుడీ పట్టుదల యధికముగ నుండెడిది. కాని "ఓవరుసీయరు" తరగతిలోనికి వచ్చిన పిమ్మట నీపట్టుదల కొంచెము తగ్గెను. ఈతఁడున్న "సెక్షను" డెల్టాలోని దగుటచే చందనపురము కాలువమీఁద నిరువది మైళ్ళ దూరమువఱకు సీతఁడు తఱచుగఁ బోవలసి వచ్చుచుండెను. సర్కారువారిచేఁ బాడుగ కీయఁబడిన చిన్నపడవలో సీతఁడు ప్రయాణ మొనరించుచుండువాఁడు. చందనపురము కాలువకు వడిలేదు. మిగుల వెడల్పును లోతునుగల యాకాలువ యొక చిన్న నదివలె నుండి నీరెప్పుడు సంపూర్ణముగఁ బ్రవహించుచుండును. చందనపురమున కెనిమిది మైళ్లదూరమునఁ జిత్రపురమను నొక పల్లెటూరా కాలువ యొడ్డునఁ గలదు.

కాలువ కిరుప్రక్కలఁ బారులుదీరిన గృహములు కలవు. గృహస్థుల కీకాలువ పెరటియందలి బావివలె నత్యంతోపయోగకరమై యుండెను. కాలువ కిరుప్రక్కలఁ బెరిఁగిన వృక్షములు కాలువమీఁదికిఁ వంగియుండును. సాంద్రతరములగు నాతరుచ్ఛాయలు కాలువయందలి జలముల నెప్పుడు చల్లగ నుంచును. ఆవృక్షశాఖలు ప్రకృతిగట్టిన పచ్చతోరణములవలె నౌకాయాత్రికుల కెప్పుడును స్వాగత మిచ్చుచుండును. పగలైన నాభాగమున సూర్యరశ్మి సొరకుండుటచేఁ జల్లనై, మనోహరముగ నుండును. మర్మరశబ్దములతోఁ బ్రయాణమొనర్చు నావలపైఁగల ప్రయాణికుల కాప్రదేశ మానందదాయకమై యుండును. నదీగర్భమునఁ బోవు నౌకల కాతరుశాఖలు కదలుచు జోలలు పాడుచుండును. కాలువ కుడివైపు గట్టున కంటి యొక్క బ్రాహ్మణగృహము కలదు. అది పూరియిల్లు. పెరటిగుమ్మము కాలువవైపున కున్నది. ఆ పెరడునందున్న పూరిచావడియందలి యరఁగు నున్నగ నలికి ముగ్గులుంచెదరు. అచ్చటనున్న మామిడిగున్నలును, చింతచెట్లును, కదళీవృక్షములును, పూలమొక్కలును జూచుటకు మనోహరముగ నుండును. ఆయరఁగున కించుక దూరమునఁగల చొప్పవామియుఁ, బసులసాలయు నందుఁ బరుండి నెమర వేయుచుండు రెండు గోవులును వాని లేఁగలును చూడ సొంపుగనుండి శ్రి

మపడీ వచ్చు చౌటసారుల హృదయముల నాకర్షించుచుండును. వేసవి యందాయరఁగు స్వర్గతుల్యమే! మోహనరావాప్రిక్కలకు వచ్చినపుడెల్ల నాయరఁగుపై విశ్రమించి పోవుచుండును. అరగడియకాల మందు విశ్రమించినచో నెంత బడలియున్న నంతహాయిగ నిద్రవచ్చును. గృహయజమాని చౌటసారుల కొఱకా వేదిక వినిర్మింపక పోయినను, వారచ్చట సౌఖ్యము ననుశ్రితముగఁ జిరకాలమునుండి యనుభవించుచుండిరి. దాని కాబ్రాహ్మణుఁ డాటంకము నొదవింపఁ దలంచి యుండలేదు. మోహనరావు చావడి ముంగిటఁ బడవను గట్టించి యావ్వేదికపై విశ్రమింపఁ బోయినపుడెల్లఁ బదిపదునాలుగేండ్లప్రాయముగల యొక బాలిక పశుల సాలనుండి పరుగుపరుగున వచ్చి గృహమునుండి యొకతుంగచాపను దెచ్చి యాయరఁగుపైఁ బఱచి మఱల నెప్పటియట్టుల దన గోవులతో నాడుకొనఁ బోవుచుండును. ఆ బాలిక యెప్పుడు నాగోవుల గంగడోళ్ళను గోకుచుఁ బచ్చిక నందిచ్చుచు, ముద్దాడుచు, మురియుచుండును. మచ్చికపడిన యాగోవులు తమ సఖియొడలు నాకుచుఁ గృతజ్ఞత సూచించుచుండును. ఆమనోహర రంగమును జూచుచు మోహనరావు తెప్పల వాల్పలేక యుండును. ఇంకొకరుమాత్ర మేమి చేయఁగలరు?

మోహనరా వొకనాఁ డట్లే చూచి యానందించుచుం

డెను. కొంతవడి కా బాలికయం దాతనికిఁ బ్రేమ ముదయిం చెను. ఆవిషయము నాతఁ డెఱుఁగఁడు! ఆతఁ డిట్లనుకొను చుండెను. "చూచుట కీబాలిక పదుమూఁడు, పదునాలుగేండ్ల వయసు గలదిగఁ గాన్పించెడిని. బాగుగ వయసు వచ్చినది. అవయవములు పరిపూర్ణావస్థ నొందియున్నవి. కంఠమున మం గళసూత్ర మగపడదు. ఈమె యవివాహితయగు కన్నియ. బ్రాహ్మణులయందిట్లుంచుట విచిత్రముగ నున్నది. ఇట్టి వైపరీత్య మీపల్లెయందుండునా? బాలిక స్ఫురద్రూప. లో టేమియుఁ గాన్పింపదు. వివాహ మెందులకుఁ గాలేదో? ఈసారి వచ్చినప్పుడు కనుఁగొందమా?" ఆతఁ డాదినమునఁ దొందరగ వెడలిపోవలసి వచ్చెను.

## రెండవ ప్రకరణము.



"సాటివారిలోఁ దల యెత్తుకొన వీలు లేకున్నది. ఈ చిక్కెట్లు తీరును? వీథిలోనికిఁ బోవ సిగ్గగుచున్నది. ఎన్ని విశ్వప్రయత్నములఁ జేసినను వరుఁడు దొరకుట దుర్లభముగ నున్నది. తల తాకట్టు పెట్టియైన నొకసంచి రూప్యములఁ దె చ్చి యిచ్చుట కంగీకరించినను సంబంధము కుదురుట లేదు.

ఏమి యీప్రారబ్ధము! ఎట్లీకష్టము గడచుట! ఈబాలిక నా కడుపునఁ బుట్టకుండినను సుఖమయ్యెడిది. రామ! రామ! నేనేమి చేయునది" అని నిట్టూర్పులఁ బుచ్చుచున్న మాణిక్యనాథుని జూచి, యాతని జ్యేష్ఠపుత్రికయగు సుకేశిని "తండ్రీ! దుఃఖింపకుఁడు! నాకును సుహాసినికిని మంచియాశ యొకటి కలుగుచున్నది. బీదసంసారుల మయినంతమాత్రమున దైవము సాయమొనరింపకపోఁడు. మన యరఁగుపై నప్పుడప్పుడొక "ఒవరుసీయరు" గారు విశ్రమించుచుండుట నెఱుఁగుదురా?" అని యడిగెను.

"అవును. చూచితిని. జ్ఞప్తికి వచ్చినది." అని మాణిక్యనాథుఁడు గోవులతో నాడుచున్న బాలికను జూచుచుఁ బరాకున ననెను.

"ఆతని సేవకుల నడిగితిమి. ఆయన కింకను బరిణయము కాలేదఁట" అని సుకేశిని పలికెను.

"ఐన నేమి?" అని మాణిక్యనాథుఁడు రిచ్చపడి సుకేశిని వైపునకుఁ దిరిగెను.

"ఆతఁడు మిక్కిలి రూపవంతుఁడు. చిన్నవాఁడు. పెద్ద మనుష్యుఁడు." అని సుకేశిని నుడివెను.

మాణిక్యనాథుఁడు వినుచు "నూఁ" అనెను.

"ఆతఁడు మన సుభాషిణిని బశులశాలయందుఁ దఱచుగ

జూచుచుండును. ఆతని కామెపైఁ బ్రేమ మొదలినది. మేము పైనుండి కనిపెట్టితిమి. వేళకాని వేళయైన నాతఁడీమార్గమునఁ బోవుట తటస్థించునప్పుడెల్ల నిచ్చట నాఁగి మన యరఁగుపై విశ్రమించుచుండును. ఆతఁడు వచ్చుసరికి సుభాషిణి గోపులకడ లేకుండినచో నైదు నిమిషములైన నాఁగఁడు. స్వయంవర కుతూహలమున నింతవఱకుఁ బెండ్లి చేసికొనలేదఁట! రజస్వలయైన పిల్లనుగాని పెండ్లి యాడఁడఁట! మే మిరువుర మీ సంబంధము కావచ్చు ననుకొనుచున్నాము. ఇంతకును దైవసంకల్పముకదా!” అని సుకేశిని యూరకుండెను.

“అమ్మాయీ! ఎంత వెఱ్ఱివాండవు! ఇది పేరాస! వారియంతర మెక్కడ? మనయంతర మెక్కడ? స్వయంవర వివాహాపేక్షితు లెన్ని పరీక్షలు చేయుదురు! ఎంత విచారణ మొనరింతురు. ఇప్పుడు చదువులు, సంగీతములు రావలయును. మొన్న గౌరీనాథునిభార్య చెప్పినది వింటివా? వారి బాలిక నుక్తలేఖనము చెప్పి వరుఁడు పరీక్షించెనఁట! అదియైన మేలే. పద్యము చదివి యభినయము చేయు మనెనఁట! ఇంతకు నాయన కెన్ని సంబంధములు వచ్చియున్నవో? ఎంతమంది కనిపెట్టుకొని యున్నారో?” అని మాణిక్యనాథుఁడు నిరాశాసూచకముగఁ జప్పరించెను.

“బాబూ! మీరట్లనకుఁడు! తప్పక కార్యసాఫల్య మ

గును. స్వార్జితపరులై, స్వతంత్రులై, స్వయంవరాపేక్షితులై, సమర్థులై యుండువారికి మన భాగ్యభోగ్యము లెందులకు? చదువు గాకుండిన చోఁ జెప్పించుకొందుమనుకొందురు. ఆయనకు మనమిచ్చు కట్నములు, కానుకలయందపేక్ష యుండదు. బాలిక లక్షణముగ నుండినచోఁ జాలును. సుభాషిణి వచ్చిన నాతనికి సిగ్గు! సమవయస్కులమగు మాతోనైన నాతఁడు కన్నెత్తి మాటలాడఁడు! కొందఱు పురుషులు స్త్రీలకడ నోరెత్తలేరు. నలుగురున్న యపుడు తమకుఁ గుతూహలమున్నను స్త్రీలతో మాటలాడఁ జాలరు. మనమెంత లోకుల యధిక్షేపణములకు లోనైనను—ఎంతకష్టపడినను—ఇంతతడ వాపినందులకుఁ బ్రస్తుతము మహోపకార మగుచున్నది. పెద్దపిల్లనుకాని చేసికొనననని యాతనికిఁ బ్రతినయఁట!" అని యాతని ద్వితీయ పుత్రిక సుహాసిని పలికెను.

"నా కేమియుఁ దెలియదు. నేనేమియుఁ జెప్పఁ జాలను. అంతయు—సోదరీమణులు—మీరే నిర్వహింపుఁ డట్లయిన—" అని మాణిక్యనాథుఁ డనెను.

"మీ రెందుల కధైర్యపడియెదరు? తప్పక మేమీకార్యము నెఱవేర్చెదము." అని సుకేశిని పలికెను.

"మంచిద"ని మాణిక్యనాథుఁడు లేచెను.

---

# మూడవ ప్రకరణము.



"అయ్యా! రెండు జాములు మీరినది. మాతండ్రిగారూరలేరు. వంట యైనది. స్నానమునకు లెండు." అని సుకేశిని యడ్డుగోడ చాటునుండి పలికెను.

"అమ్మా! ముందు గ్రామమున వంటచేయుమని వర్తమాన మంపితిని. భోజనమున కేమి లెండు. ఉదయమునఁ బాలు త్రాగితిని. కొంచె మెండ యధికముగ నుండుటచే నిచ్చట విశ్రమించితిని." అని మోహనరా వనెను.

"వేళమించి యాగంతుకముగ నెవ్వరువచ్చిన నాఁపుమని మాతండ్రిగారి యాన. మీకు భోజనమునకుఁ గొదవయా! అన్నములేక యెవ్వరైన మావంటి బీదలయిండ్లకు వత్తురా? అందులో— మీవంటివారు—" అని సుకేశిని యనెను.

"భోజనమున కుండు మని బలవంతము చేయుచుండఁ బోఁగూడదు— లెండు!" అని సుహాసిని పలికెను.

అప్పటికే సుమారు పదిగంటలైనది. దిగువ గ్రామములో నుదయమునుండియుఁ బొలముల కొలతపని చేసి మోహనరా వలసి యుండెను. పైగ వైశాఖమాసపు గాడ్పులు. తన సందేహము—సుభాషిణి కేల పరిణయము కాలేదో తెలిసికొన వలయునని కోరిక గలదు. ఇద్దఱు ముద్దియలు—

భోజనమున కాఁగుమని మొగమోట పెట్టుచుండిరి. ఇఁక బెట్టుసరిచేయుట బావ్యముకాదని—కాదు—ఇఁక బెట్టుసరిచేయలేక, మోహనరావు సుకేశిని, సుహాసినులచంచలకటాక్షములఁ జిక్కుటనో—కలవిహంగకూజితములఁ బోలువారి మధురకంఠరవములచే మత్తుఁ డగుటనో—వారికోరిక చెల్లించుటకు సమ్మతింప వలసినవాఁడయ్యెను.

ఆముద్దియల మందహాసములు—ప్రేమసంపూరిత సంభాషణములు—పరిచర్యలు, మోహనరావున కానందదాయకములై యుండెను. వారాతని లోనికిఁ గొనిపోయి, యుష్ణోదకముల జలక మాడించి, యారవేసిన పరిశుభ్రధౌతవస్త్రములఁ గట్టనిచ్చి, షడ్రసోపేతముగఁ గలిగిన దానిలోఁ బరిశుభ్రముగ భోజన మిడిరి. మోహనరావు భోజనము చేయుచుండెను. కొంతవడికి "అయ్యా! మీ రనేక పర్యాయములు వేళతప్పి యాత్రోవను బోవుచుండుట విని, మాతండ్రిగారు సాటివారును, కావలసినవారును, భోజనము లేకుండఁ బోవుచుండ నూరకుంటిరా యని పలుమారు మమ్ము మందలించిరి. ఆఁడువాండ్రమగుటచే నుద్యోగస్థులని, మిమ్మాఁగుమని చెప్పఁదలంచియుఁ జెప్పలేకపోయెడి వారము. మీకిది యన్యస్థలముకాదు. భాగ్యభోగ్యములు లేకపోయినను కావలసినవాండ్రము. మీరెప్పుడీవైపులకు వచ్చినను మోమోడి విడిచి యిచ్చుటకు ద

యచేయఁ బ్రార్థితులు." అని సుకేశిని నేయి వడ్డించుచుఁ బలికెను.

"అటులే! నాకభ్యంతర మేమి యుండును? ఎండవేళ మీయరఁగుపైఁ బరుండుటకు వచ్చుచునే యుందును. భోజనముల కేమి లెండు—మాట—ఆదరణయుఁ గావలసినవి. తఱచీ పక్కలకు వచ్చుచునే యుందును. ప్రతి దినము మీకు శ్రమ—"

"మాకు శ్రమయా—?" అని సుహాసిని నవ్వెను.

"మీ గోవులు—మీ యరఁటిచెట్లు—మీ పెరడు నాకెంతయు మనోహరముగ నుండును! కాని—" అని మోహనరా వూరకుండెను.

"సందేహింపకుఁడు..." అని సుకేశిని యనెను.

"మీ చిన్నదాని కింకను వివాహము కాలేదేమి?" అని మోహనరా వడిగెను.

"మాసుభాషిణికా? తగిన వరుఁడు దొరకక యనేక కష్టములఁ బడుచుంటిమి. ఈదినములలో నాఁడుపిల్ల పుట్టిన భయము వేయుచున్నది. కట్నములు—లాంఛనములు—వేలకువేలు బీదవాండ్రి కెట్లువచ్చును?" అని సుకేశిని బదులు చెప్పెను.

"అవును." అని మోహనరావు క్రొత్తయావకాయ

రెండవవాయు, కలుపుచుండెను.

"ఇదివఱకే కట్టు తప్పినది పిల్ల. లోకులు బహుభంగుల శంకించుచున్నారు. ఇంకను జాగు చేసినచో నూయియో—గోయియో—చూచుకొనవలయును. ఆలస్య మమృతమ్ విషమ్." అని సుకేశిని యనెను.

"అబ్బాయీ! నేను పెద్దదానను. మన్నింపుడు! ఎఱుగ కడుగుచుంటిని. మీకు వివాహమైనదా?" అని రత్నమాంబ పొదికట్టున వంగి యడిగెను. ఆమె మాణిక్యనాథుని భార్య.

"ఇంకను గాలేదు." అని మోహనరావు తలవంచు కొనెను.

"మీకుఁగూడ మా బాలికవలెనే యింత తడవైన దేమి?" అని రత్నమాంబ మఱలఁ బ్రశ్నించెను.

"ఏదో—చదువుకొనుచుండుటచే నాలస్యమైనది. చిన్నతనములో వివాహమాడ నిష్టము లేకపోయినది. ఇటీవలఁ జాల సంబంధములు వచ్చినవి. తలిదండ్రులును, దొందర చేయుచున్నారు. నేనే యుపేక్ష చేసినాను. (చిఱునగవుతోఁ దల వంచుకొని) పిల్లను స్వయముగఁ జూచుకొను కోరికచేతను—ఇతర కారణములచేతను జాగైనది." అని మోహనరా వెట్లో చెప్పివేయఁ గలిగెను.

"ఛాందసురాలను. ఏనుఁగెక్కడ? దోమ యెక్కడ?

భాగీరథి పిచ్చుకగుంటపైఁ బారినట్లు—మా సుభాషిణి నొకసారి చూడుఁడు. (అని వెనుకకుఁ దిరిగి) అమ్మాయీ! ఇటు ర మ్మా!" అని రత్నమాంబ పలికెను.

సాలంకృతయైయున్న సుభాషిణి యాకాశవర్ణపుఁ బావడపైఁ జెంగావిసెల్లాను ధరించియుండెను. ఆమె మెఱపుదీఁగవలెఁ దళుక్కుమని లోనికిఁ బోయెను. మోహనరావు కన్నులను మిఱుమిట్లు గొలిపెను.

"పిల్లను బాగుగఁ జూచితిరా? చిన్నతనము—సిగ్గు—మీరు తిన్నగఁ జూడకుండఁగనే లోనికిఁ బోయినది." అని సుహాసిని నవ్వుచుఁ బలికెను.

"ఇంకఁ జూడవలసిన పనిలేదు. ఆమె మీసోదరికాదా?" అని మోహనరావు నవ్వుచు వదినెగారగు సుహాసినిపై నొక క్రోరచూపు నంపెను.

"బాలిక—" అని సుహాసిని చెప్పుచుండ

"నా ప్రతిన యిప్పటికి నెఱవేఱినది. ఈకోరిక నెలదినముల క్రిందటనే కలిగినది. కాని నేనడుగలేక పోయితిని. మీరే యనుటచే నేఁటికిది సఫలమైనది. మామగారితో నాలోచించి వర్తమాన మంపుఁడు!" అని మోహనరావనెను.

"మాకాలోచనల కేమున్నది? మీరెప్పుడు తరలివచ్చిన నప్పుడింత పప్పునన్నము నిడి బాలికను మీచేతులలోఁ

బెట్టెదము" అని సుహాసిని యనెను.

"శుభమస్తుశీఘ్రం" అని రత్నమాంబ యనెను. మోహనరావు భోజనమును ముగించి లేచెను.

## నాల్గవ ప్రకరణము.



మోహనరావు చందనపురమునఁ దన గృహమునందలి చావడిలో రాత్రి తొమ్మిది గంటలకుఁ బడకకుర్చీలోఁ పరుండి చుట్టఁ గాల్చుచుండెను. ఆతని సౌందర్యవదనముపై స్వయముగ కృతాపరాధచింతామేఘమాలిక లావరించి యుండెను. "ఆ! దైవమా! తలిదండ్రులమాట విననందుల కెంతముప్పు వాటిల్లినది. నాకీ సంఘసంస్కరణోద్దేశ మీ చిక్కులకుఁ గారణమైనది. ఎన్ని మంచి సంబంధములు వచ్చినను, మూర్ఖుఁడనై వలదంటిని. ఉండియుండి తుదకు మూఁగదానిని జేసికొంటిని. ఒక్కమారు మాటాడించుటకుఁగూడ లజ్జనొందితిని. కన్యాన్వేషణబాధ్యత తలిదండ్రులపై నుంచి యుండినయెడల వారెన్ని యో పరీక్షలు చేసియుందురు. మంటనుజూచి భ్రమజెందు శలభమువలె నొక్క సౌందర్యమునకు మురిసి చెడితిని. సుభాషిణి యను పేరు విని సంతోషించితినికాని నేతిబీరకాయ యని యె

ఱుఁగనైతిని. నామకరణము మాటలురాక పూర్వమే చేయుదు రనుమాట నెఱుగక పోయితిని. సుహాసిని, సుకేశిని, సుభాషిణి—ఈపేరులు ప్రాసనియమము కొఱకుఁ బెట్టిరని తలంపనైతిని. అయ్యయ్యో! ఇప్పుడేమి ప్రయోజనము! అక్కల తెలివి తేటలలో సగమైన నుండకపోవునా యని తలంచితినికాని, యిట్లు శూన్యమగునని యెఱుఁగనైతిని. ఆహా! భగవంతుని లీల! నొసటిపై నెంత వ్రాసియున్నదో యది యనుభవింపవలసినదే! మూఁగది కానియెడల నెప్పుడును గోవులతోఁ జెలిమి యేల యని తలంపనైతిని. నాకీ వెఱ్ఱియేమి? ఈదినములలో నెద్దియో యంగవైకల్య మున్నఁగాని వివాహము చేయక యీడు మించనిత్తురా? అట్టికన్యనుగాని బరిణయమాడనని ప్రతిన వహించుట యెంత వెఱ్ఱితనము! ఇప్పుడు చింతించిన లాభమేమి? అగ్నిసాక్షిగా వివాహమాడిన భార్య యంధురాలైనను, గుంటిదైనను భరింపవలసినదే! విడనాడుట యెంతపాపము! వారేమైనఁ గల్లలాడి నన్ను మోసగించిరా? నా తెలివితేటలకు నేనే సంతోషింప వలసియున్నది. కాఁబోవు మఱఁదిని సుహాసిని బాగుగ హాస్యమాడినది. జీవితకాలమున కంతకు సరిపోవు శాశ్వతమైన హాస్య మాడినది.” అని మోహనరావు యోజించుకొనుచుండెను. ఇంతలో నాతనికి నిద్రపట్టెను.

---

౮

# వింత శాసనము

## మొదటి ప్రకరణము.

ఈనడుమ తణుకు తాలూకాలో నేనొక యూరిమార్గమునఁ బోవుచుండ నొక కంచరియంగడి, మార్గముప్రక్కనుండెను. నేనటు చూచుచుండ నేను గూర్చుండిన బండి పోవుచుండెను. కంచరియంగడికడ నలుగురైదుగురు కూరుచుండి యెద్దియో విచిత్రముగ వాదించుకొనుచుండిరి. "ప్రాఁతరాగి విలువ హెచ్చు" అనుమాట వినఁబడినది. ఎల్లప్పుడు రాగిశాసనములు, తాటియాకుల గ్రంథములునని యోజించునాకు "ప్రాతరాగి" అనుమాట ప్రాణాధారముగఁ గన్పట్టినది. నే నచ్చటకుఁ బోయితిని. ఏమని యడిగితిని! ప్రాచీనశాసన మొకటి వారచ్చటకుఁ దెచ్చిరి. అదియొక కాపువానికి దొరకినది. ఒక కోమటి కొని యదిరాగిచెంబుగాఁ జేయింప బేరమాడుచుండెను. రెండు రూపాయిలకు బేరము విడినది. నేనది మఱియొక రూపాయ లాభమిత్తు నిమ్మంటిని. ఈయలేదు. కంచరి శాసనపుఁ గడియమును దెగఁగొట్టుటకు సేనాము (Cutter)

తీయుచుండెను. నాజేబులో నారు రూపాయి లున్నవి. ఆయా రురూపాయి లిత్తు నిమ్మని తుదకుఁ జెప్పితిని. అంగీకరింపలేదు. అరవమువలెనున్న యాలిపి ప్రాచీనమైనదని నాకుఁ దెలియును. అది యెన్నివందలైన నిచ్చి కొనవలెనని యున్నది. నా తొందర చూచినకొలఁది వైశ్యుఁడు బిగువుసేయఁ జొచ్చెను. తుదకు నేను విసిఁగి తెగఁగొట్టకుండ బ్రతిమాలి కంచరిపై నొక్క విషాదపుఁజూడ్కి నంపి, బండి కడకు వచ్చితిని. కోమటి 6 రూపాయిలకు శాసన మిచ్చెను. పరమసంతోష మైనది. వెంటనే మరల నేరైన వచ్చిన శాసనము పోవునను వెర్రిభయముతో బండి నెక్కితిని. బండి చరచర పోయెను. శాసనమును జూచితిని. అక్షరములు తెలియుటలేదు. కొన్ని యక్షరములు పోల్చితిని. సరియే! ఏదియో చరిత్రికమూల్యమైన విషయము కాకపోదని నేనుబ్బూటలూరుచు మాయూరు చేరితిని. టపాలో బంగీకట్టి విజయనగరమునందున్న యొక శాసనశోధకుని కడకుఁ బంపితిని.

---

## రెండవ ప్రకరణము.



మఱి పదునేను దినముల కిక్రింది జవాబు వచ్చినది.

"శాసన పద్యములు, శ్లోకములఁ జదివితిని. 7, 8 వందల

సంవత్సరములకుఁ బూర్వపు శాసనమని తెలిసికొంటిని.

మిత్రమా!

మీరు పంపిన శాసన మందినది. ఇది చరిత్రకుఁ బనికి రానిదైనను వైద్యమునకుఁ బనికివచ్చునది. ఇందు మూఁడు తెలుఁగు పద్యములును పదిరెండు సంస్కృతశ్లోకములు నున్నవి. లిపిచాళుక్య యుగమునందలి నందినాగరిలిపి. ఇందలి విశేష మేమనఁగా? తణుకు తాలూకా సిద్ధాంతము గ్రామములోఁ దూర్పున వసిష్ఠానది తీరమున నొక మఱ్ఱిచెట్టు కలదు. దాని కుత్తరదిశ యందొక చిన్న యినుపమేకుండును. దానికి నాలు గడుగులు లోతు తవ్వినయెడల నొక కుండ కన్పట్టును. అం దొక బంగారు రేకుండును. దానిపై నొక యౌషధయోగము కలదు. ఆయోగము ననుసరించి సిద్ధముచేసిన పదిలక్షల యౌషధపుఁగొప్పె లాకుండలో నుండును. కుండ పైకిఁదీయకుండఁ గొప్పెలు తీసుకొని వాడుకొనవచ్చును. ఇది మూడువందల సంవత్సరములకుఁ బిమ్మటఁగాని వాడఁగూడదు. ఇదియొక సిద్ధునివలన సంపాదించిన యోగము. అప్పటికి నావంశమువారి కీయోగము తెలియక పోవచ్చునని కొంతయౌషధ మాసిద్ధుని చేతనే చేయించి యుందుంచితిని. ఈశాసనము దొరికిన యెర యిన నిది యుపయోగించి సగము సొమ్ము దైవకార్యములకుఁ వినియోగింపవలెను. ఔషధ మనుపానభేదములచే నన్ని రోగ

ములకు వాడవచ్చును. మృతినొందిన మనుష్యునకు రెండు గ డియలకాల మీఁకుప్పె పెదవిపై వ్రాసిన పునర్జీవము కలవాఁ డగును. అయితే, ఆమృతినొందినవాఁ డాకస్మికముగ నస్వాభా వికమైన మరణము నొందినవాఁడై యుండవలెను. ఇత్యాది.”

ఇది చదువునప్పటికి నాకాశ్చర్య మెక్కువమైనది. “నే నున్న యూర నీయౌషధమున్నదా? ఆరు రూపాయిలు నష్ట ము కాఁగూడదు. చరిత్రమాట కేమి? చరితార్థమైన మాట వింటిని.” అని వెంటనే మఱ్ఱిచెట్టుకడకుఁ బోయితిని. మేకున కై పరీక్షించితిని. కనఁబడ లేదు. మఱునాఁడు మనుష్యులను దీసికొనివెళ్లి శాసనవాక్యానుసారము త్రవ్వించితిని. శాసన వాక్యము లన్నియు సత్యమైనవి.

---

## మూఁడవ ప్రకరణము.



మంచు శాసన వాక్యానుసారము వాడుట కారంభించితి ని. అందఱకు గుణమిచ్చుటయే. జమీందారులు కూడ నన్నుఁ బిలిపించుచుండిరి. ఒకనాఁడొక బాలు డాకస్మికముగఁ జెట్టు మీఁదనుండి పడి మరణించెను. ఈయౌషధమువలన జీవించెను. భరతఖండమంతట నీవిచిత్రవృత్తాంతము వ్రాకిపోయినది. అనే

క వేలరూపాయిలు వచ్చుచుండెను. కొప్పెవెల 25 రూపాయి లు కూడఁ జేసితిని. అమ్మకము వృద్ధికాఁ జొచ్చెను. నిద్ర లేదు. ఎంతసేపు రోగులు—ధనము—నేనెంత యదృష్టవంతుఁ డను.

నే నిప్పుడు చరిత్రమాటయే మఱచితిని. దైవకార్య మునకు సగము వెచ్చింపలేదు. నామందు దేశదేశములవారికి వెల్లడియైనది. అందఱకు గుణమిచ్చుటయే! అనేకమంది మర ణించినవారు బ్రతికిరి. నాయింట నిప్పుడు తూఁగుటుయ్యెలలు, హంసతూలికాతల్పములు! మాయూరి పొలములలో సగము నావే! నాచరిత్రప్రీతి యూరకపోలేదు. కాని శాసనవాక్యము నతిక్రమించితినని నామనమున బాధకలదు. నాకు ధనము వృథగా వ్యయపెట్ట నిష్టములేదు. ఎవ్వరికి నక్కఱలేని చరి త్రలకై నేనీధనము నేల వెచ్చింపవలెను? దేశాభ్యుదయము కాకున్న నాకేమి? అను తలంపులు పుట్టినమాట నిశ్చయము. ఏమి చేయను? ధనాశ యట్టిది! నాకిప్పుడు శాసనములన్న ను తాటియాకుల గ్రంథములన్నను తలనొప్పి. ఇట్లుండగా నాకొక పుత్రుఁ డుదయించెను. ఇఁక లోకవార్తలతో నాకు సంబంధమే లేదు. ఒక చరిత్రకారునికి నేను దర్శన మీయ లేదు. ఒకలాయరు పంపఁగా నేనొక పత్రికకొక వేయిరూ పాయ లిచ్చితిని. ఆతఁడు నన్ను, నామందును, నాపొడుము

ఖ్యాతినిగూడ వర్ణించుచు, నాకాశమున కంటఁబొగడుచు నేమే మియో వ్రాసెను. ఇదివఱకుఁ బల్లెటూరివారికిఁ మాత్రమే తెలిసిన నాకీర్తి నాగరకులకుఁగూడఁ దెలిసినది. నేను దాన కర్ణుఁడ నని, తెలుఁగు విక్రమార్కుఁడ నని, ఉత్తర కృష్ణరా యుఁడ నని, యా పత్రికాధిపతి వ్రాసెను. అక్క డనుండి మందలుమందలుగాఁ కవులు మందులమున్నికొ ను నాకడకు రాసాగిరి. "ఓ హెూ! దానకర్ణా! అని నన్ను "అన్నపూర్ణా!" అని నాభార్యను స్తుతించుచు శతకములు చె ప్పిరి. కృతు లిచ్చిరి. ఒకకవిజంట మామీఁద పది నిమిషము లలో నేడువందల పద్యములు చెప్పెను. నాకీ భూమియున్న ట్లు, నేను దానిమీఁద నున్నట్లు తోఁచలేదు. స్వప్న జీవిత మును గడుపుచుంటిని.

## నాల్గవ ప్రకరణము.



ఒకనాఁడొక వృద్ధుఁడు నాకలలోఁ గాన్పించెను. "వైదె వకార్యము మఱచుచున్నావా? కుమారా!" అని వెడలిపో యెను. నేనది భ్రమయని కొంటిని. ఆవృద్ధుఁడు చెప్పి చె ప్పి, కొన్ని మాసములు తిరిగెను. విసిగెను. ప్రతిదినము స్వ

ప్నమునఁ గనఁబడ సాగెను. తుద కొకనాఁడు "మూర్ఖుఁడా! నీకులవృద్ధుఁడనగు నామాటను, శాసనమును మీరి నీవిట్లు చే యుదువా? నీవు మూఁడు గడియలలో మృతినొందుదువు. ఇ ప్పుడైన సగము ధనమును నీవు దైవకార్యమున కుపయోగింప నియెడల సపుత్రికముగ నశింతువు." అని శపియించి యదృ శ్యుఁ డయ్యెను. నే నులికిపడి లేచితిని. పాపభీతిగల నాకు గుం డెలు కొట్టుకొన సాగెను. నేను లేవలేక పోయితిని. నాయొ డలు సగమువఱకుఁ బాలరాయినలెఁ దెల్లబడిపోయెను. నాభి వఱకు నట్లున్నది. గిల్చిన నాటదు. వెంటనే నాభార్యను బిల చి, "నేనొక గడియలోఁ జనిపోవుదును. నాధనములో సగము కుటుంబమునకు సగములో నొకవంతు చరిత్రకారులకు, శాస నసంపాదకులకు, నొకవంతు సంస్కృతవిద్యకు, నొకవంతు మన గ్రామమునందలి నందీశ్వర కేదారేశ్వర మాధవస్వాముల యాలయములకు నిచ్చివేయుఁడు. ఇదియే నామరణశాసన ము. నా శాసనము—శా—స—న—ము × × ×"

ఈ పురుషుఁడు మరణించునరికి నల్లశిలగా మారిపోయె నఁట! ఆశిల యిప్పటికి నాగ్రామమునం దున్నదఁనుడు! స్త్రీ లు బావికడ బోరగిలవేసి బట్టలుతుకుచున్నారు. ఈకథ జ రిగి చిరకాలమైనట్లు తోఁపదు—వారి కుటుంబము వారాతని వాక్యముల మన్నించియే యుండిన మన చరిత్రల కింత దుస్థితి యుండునా? విచార్యము. ———

౯

# వీరపత్ని.

(మీ రేల వచ్చితిరి?)

రాత్రి జామైనది. నిండుపున్నమ యగుటచే సంపూర్ణముగ చంద్రుఁడు ధవళకాంతులఁ బ్రకాశించుచుండెను. సర్వప్రదేశముల యందును జంద్రికాంతి ప్రతిఫలించుచుండెను. వృక్షములపైనుండు నొక్కయాకైనఁ గదలుట లేదు. క్రమక్రమముగఁ గాలము జరిగిపోవుచున్నను, మహావేగముతోఁ బరుగిడుచుండినను, మేఘరహితమైన నీలపుటాకసమును, దాని యగాధమైన సౌందర్యమును, జూచుచు నుండువారికి ధ్వనిరహితమైన యాసమయమునం దేమియుఁ గాలగమనము తెలియుటలేదు. వాయుప్రచారము లేకుండుట యీనిశ్శబ్దమునకుఁ గాని, యీశాంతికిఁగాని కారణమేమో మనకుఁ దెలియదు. ఆసమయగభీరతను గమనించుచు నొకలేమ—పదిపదారేండ్ల బాలిక యనవచ్చును—విజయనగరము నందలి సౌందర్యసౌధమున కంటియున్న యుద్యానవనము నందలి చంద్రికాంత వే

దికపైఁ గూర్చుండియుండెను. ఆమె ముఖకాంతి వెన్నెలయం దొక్కొకసారి ప్రతిఫలించు చుండుటచే నామె యొక్కొక సారి యిటునటు కదలు చుండవలయును. యోచనానిమగ్న రైు నీలపుటాకసమువంక నదేపనిగఁ జూచుటవలన నామె కే మిలాభము? ఇప్పు డామె ముఖపద్మముపై నొకతీఁగ క్రీనీడ ప్రసరించియుండెను. ఆమె చాలవఱకట్లు యోచించి వెనుక నెద్దియో యాలుకుడు విని యావైపునకుఁ దిరిగి చూచినది. అట్లు చూచునప్పు డామె వదనమునుండి దరహాసచంద్రికాప రంపర లావెన్నెల తెరలలో నూఁగియూఁగి కలసి యదృశ్య మైనవి. ఆమె నిరూత్సాహ పడినది. ఆమె వినిన ధ్వని స మీరకుమారుని స్వల్పచలనమున రాలిన పండుటాకుదై యుం డును. ఆమె యాతురతఁ జూడ నామె యెవ్వరికొఱకో వేచి యున్నట్లు స్పష్టమగుచున్నది. తిరుగ నొక్క నిట్టూర్పుఁ బు చ్చి యాకోమలి నీలపుటాకసమువంక మరలఁ జూచుచుండెను.

ఆమె వెనుక నిరువది గజముల దూరమునందుఁగల యొక పొదరింటి చాటునుండి యొక పురుషుఁడు వచ్చుచుండె ను. ఆతని దుస్తుఁ జూచిన వారాతఁడు తప్పక యొక యో ధుఁడని యెఱుంగఁ గలరు. ఆతఁడు మెల్లఁగ నడుగు లిడుచు కత్తియొఱపై కాదు—పిడిపై—చేయి నిడుకొని బాలికను స మీపించుచుండెను. ఎక్కడ శబ్దమగునో యని యాతఁ డెం

ముట్టాకులుగల ప్రదేశములఁ జూచుకొని యవి లేనిప్రదేశము
ల భద్రముగ నడుగులిడుచు వచ్చుచుండెను. తన యాకార
మేమియు నగుపడకుండఁ జెట్లనీడక్రింద నడచుచు వచ్చుచుం
డెను. అతఁ డెంత జాగరూకతతో వచ్చినను ఆతని పడుచు
తనపు గరువము కారణమున నొకలత కాతని పాదము తగిలి
కొంచెము ధ్వనియైనది. అలాగే నంటియున్న పత్రములు కొం
చెము గలగలధ్వనిని గలిగించినవి బాలికకా శబ్దము వినఁబ
డినదా? వినఁబడియే యుండవచ్చును. కాని తీవ్రముగ నాలో
చనలో మరల మునిగియుండుటనో, ప్రకృతి సౌందర్యమును ది
లకించుచు నానందము నొందుచుండుటనో, యీశబ్దముకూడ
నేగాలివలననో కలిగియుండుననియో, బాలిక వెనుకకుఁ దిరిగి
చూచినది కాదు.

పురుషుఁడు బాలిక కైదారు గజముల దూరమువఱకు
నట్లు మెల్లగవచ్చి యొక్కగంతువైచి యామె కూర్చుండియు
న్న శిలాఫలకమును సమీపించెను. సమీపించుటయే తడవు
గఁ గత్తిపిడిపైఁగల హస్తమును దీసి యామె నయనములను
నవ్వుమొగముతో తటాలున మూసెను. బాలిక విభ్రమము
నొందినది. ఆమె కేమిచెప్పుటకును నోరాడుట లేదు. తుదకు
రెండు చేతులతో నాతని చేతులఁ బట్టుకొని కన్నులనుండి
యాతని హస్తములను విడిపించుటకుఁ బ్రయత్నించి విఫలమ

నోరథ యయ్యెను. బాలిక సాహసముచేసి "ప్రాణప్రియా!" యని పురుషుని చేతులఁ దొలగించెను. ఇప్పుడా హస్తములు వానియంతట నవియే విడిపోయినవి. బాలిక వికళితనేత్రము లతో లేచి యాతని కౌఁగిలించుకొని యాతని యురస్థలమున నామె శిరమును జేర్చి యథోవదనయై యుండెను.

ఆపురుషునివయసు సిరువది దాటియుండును. నల్లగఁ దుమ్మెదఱెక్కలవంటి మీసములు త్వరత్వరగ నెదుగుచు నాతని నవయౌవనమును బయలుపఱచు చుండెను. విశాలఫాలత ల మాతని ధైర్యస్ఫూర్తిని, సోగకాటుకకన్నుల తారళ్య మాతని ప్రేమమును వెల్లడించుచుండెను. నడుమ నొకసారి యాబాలిక పురుషుని వదనము నతిప్రయత్నముపైఁ గన్నులు పైకెత్తి చూచినది. యువకుఁడాసమయమున నెఱిఁగి "లావణ్యమయీ!" యని యొకముద్దు పెట్టుకొనఁ బ్రయత్నించెను. లావణ్యమయి కన్నులు మరల ముఖముతోఁ గ్రిందికిఁ బోయి నవి. లావణ్యమయి కాలి బొటనవ్రేలితోఁ గ్రిందఁబడియున్న ఖండితపత్రము నొకదాని నాడించుచు "రణరంగమున వార్త లేమి?" యని ప్రశ్నించెను.

"వార్తల కేమి? తురుష్కులయుద్ధము ప్రబలుచునే యున్నది. మన కర్నాటకబలము లప్రతిమాన శౌర్యప్రతాప ములఁ బ్రదర్శించుచున్నవి." అని యువకుఁడు ప్రత్యుత్తర

మొసఁగెను.

"అట్లయిన విజయము మనకే యగును?" అని బాలిక సంప్రశ్న మొనరించుచుఁ బురుషుని కత్తిపిడిపై వ్రేలుపెట్టి యాడించుచుండెను.

యువకుడు ప్రత్యుత్తరము నీయక చేరువనున్న లతవైపునకు వెఱ్ఱివానివలెఁ జూచుచుండెను. బాలిక యిప్పుడు నిర్భయముగఁ దలయెత్తి మాటలాడఁ దలంచెను. ప్రత్యుత్తరము నీయని పురుషుని వదనమునకై పైకిఁ జూచెను.

"యుద్ధము నిలుపుచేయఁ బడెనా?" యని బాలిక యడిగెను.

"లే—దు" యని యువకుఁ డనెను.

"అట్లయినచో రణరంగపరిసమాప్తి కాకుండ మీ రేల వచ్చితిరి?" అని లావణ్యమయి కుంచితభ్రూయుగ్మముతో నడిగెను.

యువకుఁడు నవ్వుచుండెను.

"విజయము చేకూరినదా? లేకుండిన మీరింత యుత్సాహముగ నుండరు. మరియు మీవంటి క్షత్రియకుమారులపజయమునకు వెఱచికాని, పడతులపైఁ మోహమునకుఁగాని యుద్ధరంగమును విడువరు. అది నేనెఱుంగుదును. ఉత్తమ క్షత్రియ కుటుంబమునఁ బుట్టిన మీవంటి మహాశయుల సందే

హించి నే నపచార మొనరించితిని. సత్యము చెప్పుఁడు" అని లావణ్యమయి పలికెను.

"రాజకుమారుఁడు "నేను వెడలిపోయెద" నని లావణ్యమయి కౌఁగిలి విడిపించుకొనఁ బోయెను.

"ఏల? మీరు ముందేల వచ్చితిరి? ఇపు డెచ్చటకుఁ బోయెదరు?" అని లావణ్యమయి యడిగెను.

"రామరాజుచక్రవర్తి సైన్యములు నిన్ననే యుద్ధరంగమును జేరినవి. ఇదివఱకు వరుసనుబట్టి మనకు జయము చేకురుననుకొంటిని. కాని మహమ్మదీయులకే జయము కలుగునని సందియము గలిగి, యిప్పుడు మరణము నిశ్చయపఱచుకొంటిని. నిన్నొకసారి చూచి మరి యుద్ధరంగమునఁ బ్రాణములు విడువనెంచి యిచ్చటకు వచ్చితిని. శౌర్యలోపమునఁ గాని, ప్రాణరక్షణమునందలి పామరత్వమునఁ గాని, వచ్చియుండలేదు" ఇట్లు చెప్పి రాజకుమారుఁడు కౌఁగిలి తప్పించుకొని వెడలిపోయెను.

"కేశవదేవా! నాథా! ఒక్క మనవి!" అని బాలిక వెంటఁ బడెను.

యువకుఁ డుద్యానవన ద్వారము దాటి రాజవీధిని బడి వెడలిపోయెను. బాలిక ద్వారమువఱకు వచ్చి కేశవదేవుఁడు గుఱ్ఱము నెక్కి యప్పుడే వెడలిపోవుటచే వెనుకకు మరలెను.

## II.

యుద్ధరంగము మహాభీభత్సాకారమును దాల్చియుండెను. చక్రవర్తియగు రామరాజు మహమ్మదీయులపై స్వయముగ సైన్యము నడుపుచుఁ గత్తితీసి యుద్ధముఁ జేయుచుండెను. మహమ్మదీయ సైన్యము చాలవఱకు నాశనము నొందినది. ఆంధ్రులకుఁ బరాజయమగునని చంకలెగరవేసిన విజాపురపు (Bijapur) నవాబుల యాస లడుగంటుచుండెను. ఇంతలో నెవ్వఁడో యొక దుర్మార్గుఁడు హిందువుని దుస్తులతో రామరాజెక్కిన గజము వెనుకకు వచ్చి కత్తితో నొక్క వేటున నాతని శిరమును నఱికి, యది బల్లెమునఁ గ్రుచ్చి యశ్వము నుఁడాయించి, శత్రుశిబిరమును జేరెను. రామరాజు శిరఃఖండనమైనట్లాతని యేనుఁగుపైనుండిన మావటీనికైనఁ దెలియదు. యుద్ధ మెప్పటియట్లు భీకరమై వృద్ధిపొందుచుండెను. నవాబు చేయునది లేక రామరాజు శిరము నొక బల్లెమునకు గ్రుచ్చి, యొకసేవకునకిచ్చి, సైనికులకుఁ బైకెత్తిచూపుచు "మీ చక్రవర్తి శిరమిదిగో" యని యఱచుచు, వారి ద్రోహమునకుఁ బ్రతిఫలముగ వారొందిన చక్రవర్తి శిరమువలన వారు పొందఁదగిన లాభమును వారు పొందుటకుఁ దగిన ప్రకటనమునుఁ జేయుచుండిరి. కర్ణాటక సైన్యమామాటలు విశ్వసింపక ముందునకుఁ బోవుచునేయుండెను. ఇంతలో నాంధ్రసైన్యమునఁ "జ

క్రవర్తి మడసెమడసె" నను భయంకరపరివాదము ప్రతిధ్వనిం
చెను. ఆంధ్రవీరులందరా చక్రవర్తి గజమువైపునకుఁ దిరిగి
చూచిరి. చక్రవర్తి మొండెము గజముపై వారి కగుపడెను.
ఆంధ్రసైన్యము దుఃఖపూరిత మయ్యెను. నాయకుఁడు లేని
యుద్ధము నడుపుట తగదని వారు పలాయనమొంది వెనుకకుఁ
దిరిగిరి. ఇంతలో దూరమునుండి యొక యోధుఁ డాంధ్రసై
న్యమును హెచ్చరించుచుఁ గత్తి పైకెత్తి, గుఱ్ఱముపై నిలువ
బడి పరువెత్తుకొని వచ్చుచుండెను. అందఱు నటుచూచిరి. ఆ
యోధుఁ డీసైన్యమునకు నాయకుఁడై యుద్ధము సాగించెను.
మహమ్మదీయులు పరుగు లిడవలసి వచ్చెను. మరల ద్రో
హమే చేయఁబడినది. యోధుని వెనుకనుండి మరల నింకొక
క్రూరాత్ముఁడు వచ్చి—అయ్యో!—ఆ యోధుని—ప్రథమ
యోధుని—ప్రధానయోధుని—బాలకుఁడగు యోధుని—
లావణ్యమయి ప్రాణప్రియుని—కేశవదేవుని—అక్కటక్క
టా!—నెల దినముల క్రితమే పెండ్లియైన బాలుని—హృద
యముకడఁ బొడిచి పాఱిపోయెను. కేశదేవుఁడు క్రిందకొరి
గెను. ఆంధ్రసైన్య మాతని చుట్టు మూఁగెను. వారందరా
బాలనాయకుని కాపాడుచు యుద్ధముమానిరి. ఆబాలుఁ
డు కన్నులు దెఱచి యొక్కసారి లేచి కత్తి పైకెత్తి "సోద
రులారా! సంగరరంగమును విడువకుఁడు—నాయశ్వము—

కత్తి—శత్రు—" యని క్రిందకుఁ బడిపోయెను. ఆంధ్రులందఱు రోషపూరితులై ముందునకుఁ బోయిరి. చేతనైనంతవఱకు మహమ్మదీయ సైన్యమును నఱకుచు, నఱకులఁ బడుచుఁ బోవుచుండిరి. యుద్ధమింకను బ్రబలముగ జరుగుచుండెను. మహమ్మదీయ ఫిరంగులనుండి యుక్కుగుండ్లు శత్రుసైన్యముపైఁ గురియుచుండెను. కేశవదేవుఁడు పడియున్నచోట నొక యుక్కుగుండు వచ్చి పడి ధ్వనియయ్యెను. ఆతఁడు కన్నులు తెఱచి చూచుసరి కాకసముపైఁ గాకులు, గ్రద్దలు, ప్రక్క నాయుధధారులై వీరస్వర్గమునొందిన వీరుల మృతకళేబరములు, పడియున్న పీనుఁగుల పెంటలు కనుపడెను. తన తల మరియొక యోధుని యొడియందుంటఁ దెలిసికొనెను. ఆ యోధుని ముఖమును జూచుచుఁ గేశవదేవుఁడు దాహమని నోరు తెఱచి సంజ్ఞ యొనరించెను. హృదయముకడ తగిలిన గాయమునుండి రక్తము గాటముగ స్రవించుచుండెను. అక్కడనున్న తాబేటికాయనుండి యోధుఁడు కొంచెము జలమును కేశదేవునినోటఁ బోసెను. పెదవులు తడుపుకొని కేశవదేవుఁడు లేచి నిలువఁబడఁ బోయెను. కూర్చుండుట కష్టమయ్యెను. హస్తమును గ్రిందనానుకొని సగములేచి, యొకచేతిని పైకిఁ జూపుచు, చూపుడు వ్రేలితో నిరూపించుచు, నిట్లు చెప్పెను. "భ్రాతృవర్యా! నీవు విజయనగరమును జేరిన పిమ్మట నాభార్య

యగు లావణ్యమయి కడకుఁ బోయి నీభర్త యుత్తమక్షత్రియధర్మము ననుసరించి, కృష్ణదేవరాయాది మహాపురుషులు జన్మించిన వంశమున కపకీర్తిరాకుండ, శత్రువుల నురుమాడుటయందే తన రక్తమును వినియోగపఱచుచుఁ బ్రాణములు విడిచెనని తెల్పుము. విజయనగరపుర రాజులు పడతులపై ననురాగముకొఱకు రణరంగమును విడిచివచ్చువారు కారనుము—అట్లు వలదు—ఆమె దుఃఖించును— పడతులపైఁ బ్రేమమునైనఁ దోసి—కాదు—దేశముపైఁ బ్రేమముకంటె నీభర్తవంశమున నెవ్వరును బడతులపై— ప్రేమము—న—ధి—కముగ—నెంచరను—ము.” ఇంక శ్వాసరాదు. కేశవదేవుని ప్రాణవాయువులు బహిర్గతమై పోయినవి.

## III.

ఆహా! లావణ్యమయీ! వీరపత్నీ! భర్తను నవ్వుమొగముతో ననుసరించుచుంటివా? ధన్యవు!!!

× × × ×

విజయనగరపుర బాహ్యప్రదేశమునఁ జందనతరుఖండములఁ జితిగాఁ బేర్చిరి. వేలకొలఁది జనులు గుమికూడి యుం

డిరి. అప్పుడొకపల్లకి వెంటఁ దూర్యారవములతోఁ బసుపుకుంకుమలు పుష్పములు ఫలములు నెగురవేయుచుఁ బురజను లెందఱో వచ్చుచుండిరి. పుణ్యస్త్రీలు తండోపతండములుగఁ బల్లకి వెంటఁ వచ్చుచుండిరి. ఆ కోలాహలమువలన దిక్కులు పిక్కటిల్లుచుండెను.

అప్పుడా పల్లకినుండి కరవాలము చేతనుంచుకొని, పుష్పమాలాలంకృతయగు నొకకాంత బయటికి వచ్చెను. ఆమె శిరోజములపై—కట్టుకొనిన వస్త్రములపై—నంతటఁ బసపుకుంకుమలు చిలకరింపఁబడి యుండెను. పరిచారికలు బంగరుపళ్ళెరములతోఁ బసుపుకుంకుములఁ బంచిపెట్టుచుండిరి. వాద్యములు మ్రోఁగుచునేయుండెను. ఇంచుక వెనుకఁ బల్లకులలో వచ్చియున్న రాణివాసమువారికిఁ గూడఁ బసుపుకుంకుమ లీయఁ బడినవి. వివరములేల? పురోహితుఁడు బ్రాహ్మణబృందముతో మంత్రముల నుచితకృత్యములఁగూడ ముగించితి నని చెప్పెను. ఒకవంక రాజపురుషులు—నలువంకల రక్షకభటులు—సర్వసిద్ధముగ నుండిరి. చితిపై ఖడ్గమునుంచి యగ్ని బ్రజ్వలింపఁ జేసిరి. అందఱు నావంకఁ జూచుచుండిరి. మొదటఁ బల్లకినుండి దిగిన బాలిక మహాజనసంఘమునకు నమస్కరించి యామహాగ్నిజ్వాలలోనికి దుమికెను. "ఆహాహా! లావణ్యమయీ! వీరపత్నీ!" అని కేకలు నింగి ముట్టెను. బ్రాహ్మ

ఃఖుల మంత్రములు చల్లారెను. వీరావేశము నొదవించిన తూ ర్యారవము లడఁగిపోయెను. గుంపు చెదఱిపోయెను. ఇఁక భస్మమే—కాలిన చితిగురుతులే—మిగిలియుండెను.

---

ఓం శాంతిశ్శాంతిశ్శాంతిః.



కమలకుటీరమువారి
నూతన ప్రచురములు.

స్కూలుఫైనలు విద్యార్థులకీరెండు గ్రంథములును ముఖ్యపఠనార్హములు.

ఆంధ్రవాఙ్మయ చరిత్రము ... 3-0-0.
శతకకవుల చరిత్రము ... 3-0-0.

వేమనజీవిత చరిత్రము ... 1-8-0.

విద్యార్థులకు పఠనార్హములైనవి.

పారిజాతము.

(కృష్ణదేవరాయల దివ్యచారిత్రము)
3, 4, 5, ఫారములకు 0—12—0.

లలితకుమారి.

(మనోహర నవల) 3, 4, ఫారములకు 0—12—0.

మణిమేఖల.

(నవీన కథల సంపుటము)
2, 3, 4, ఫారములకు 0—12—0.

కమలకుటీరము.
ఎడ్యుకేషనల్ పబ్లిషర్సు,
హెడ్డాఫీసు—నరసాపూర్.

